# చైర్మన్‌తో ముఖాముఖి



నూకారపు సూర్యప్రకాశరావు

**ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రభుత్వ పాఠశాలల్లో డిజిటల్ తరగతులు ప్రారంభిస్తారట. సాధ్యమంటారా?**

ఎందుకు సాధ్యం కాదు. సాధనమున పనులు సమకూరు ధరలోన..అనేకదా పెద్దలు చెప్పింది. ఏపీ సర్కార్ చాలా ముందు చూపుతో విద్యావ్యవస్థలో సమూల మార్పులకు శ్రీకారం చుట్టింది.అందులో భాగంగా ప్రభుత్వ పాఠశాలల్లోని తరగతలను డిజిటల్ క్లాస్‌రూంలుగా తీర్చిదిద్దేందుకు నడుంబిగించింది.అంతే కాదు విజయవాడలోని సీవీఆర్ పాఠశాలో,విద్యావాణి పేరుతో సీఎం చంద్రబాబు కార్యక్రమాన్ని ప్రారంభించారు. అదే రోజు రాష్ట్ర వ్యాప్తంగా 28 పాఠశాలల్లో ఏర్పాటు చేసిన 62 డిజిటల్ తరగతులను ప్రారంభించారు.28 పాఠశాలల విద్యార్థులతో సీఎం ఆన్‌లైన్‌లో మాట్లాడారు.ప్పటికే 4 వేల పాఠశాలల్లో డిజిటల్ తరగతులు ప్రారంభించేందుకు టెండర్లు పిలిచామని వెల్లడించారు.సో..ప్రైవేటుకు దీటుగా ప్రభుత్వ పాఠశాలలు ప్రగతి పథలో సాగాలంటే సర్కాం ఇలాంటి కార్యక్రమాలు అమలు చేయడం తప్పని సరి.

**సిస్టర్స్ ఫర్ ఛేంజ్ పేరిట ప్రచార కార్యక్రమాన్ని ప్రారంభించిన కవిత– కామెంట్ ప్లీజ్ సార్!**

మంచి కార్యక్రమం. సోదరుల క్షేమం కాంక్షించే ప్రతి ఆడపడుచు తప్పకుండా పాల్గొనాల్సిన కార్యక్రమం. హెల్మెట్ ధరించకుండా వెళుతూ రోడ్డు ప్రమాదాలకుగురై దేశవ్యాప్తంగా ప్రతిరోజు 400మంది చనిపోతుండటం ఎంపీ కవిత కలచి వేయడంతో ఈ కార్యక్రమాన్ని రూపొందించారు. బైక్‌పై వెళుతున్నవుడు తప్పనిసరిగా హెల్మెట్ పెట్టుకోవాలని, ఈ విషయాన్ని రాఖీ కట్టాక తమ సోదరులకు తప్పక చెప్పాలనేది ఈ కార్యక్రమం ఉద్దేశ్యం. రాఖీపౌర్ణమి పర్వదినం ఆగస్టు–7 వరకు ఈ కార్యక్రమం కొనసాగనుంది. ఫేస్‌బుక్, ట్విటర్, వాట్సప్ తదితర సామాజిక మాద్యమాల ద్వారా తెలంగాణ జాగృతి వర్గాలు హెల్మెట్ వాడకంపై పెద్దఎత్తున ప్రచారం చేపట్టనున్నాయి. హెల్మెట్ ధరించడం అనే విషయంలో పాలకులు తీసుకుంటున్న నిర్ణయాలు ప్రజల సహకారం లేక నీరుగారి పోతున్నాయి. అందుకే ప్రజలను భాగస్వాములను చేస్తే తప్ప ప్రభుత్వ కార్యక్రమాలు సక్సెస్ కావు. అది దృష్టిలో ఉంచుకుని కవితి చేపట్టిన కార్యక్రమానికి మన వంతు సహకారం అందిద్దాం!

**గుజరాత్ మాజీ ముఖ్యమంత్రిఆనందీబెన్ తో విజయసాయి భేటీ వెనుక ఆంతర్యం ఏమిటంటారు?**

ఆంతర్యం ఏముంటుంది. వైసీపీ రాజకీయ పార్టీ. దాని ప్రతి కదలిక వెనుక రాజకీయ కోణం ఉంటుంది. ఎన్నికలు మరో రెండు సంవత్సరాలు ఉందనగానే వైసీపీ దూకుడు పెంచిందని చెప్పక తప్పదు. అంతేకాదు రకరకాల వ్యూహాలతో జాతీయ స్థాయిలో పట్టు పెంచుకునే ప్రయత్నం చేస్తోంది. కేంద్రం, రాష్ట్ర స్థాయిలో అత్యున్నత పదవులు దక్కే అవకాశం ఉన్న ప్రముఖులను ముందస్తుగానే వైసీపీ నేతలు కలుస్తున్నారు. రాష్ట్రపతి రామ్ నాథ్ కోవింద్ ను కూడా వైసీపీ ఎంపీ విజయసాయి రెడ్డి ముందుగానే కలిశారు. మర్యాదపూర్వకంగానే ఆయనను కలిశానని అప్పట్లో ఆయన చెప్పారు. తాజాగా, గుజరాత్ మాజీ ముఖ్యమంత్రి ఆనందిబెన్ పటేల్ ను అహ్మదాబాద్ లో నిన్న విజయసాయి కలిశారు. తెలుగు రాష్ట్రాలకు ఆనందిబెన్ పటేల్ గవర్నర్ గా వస్తున్నారే ప్రచారం జరుగుతున్న నేపథ్యంలో కలవడం ఇక్కడ గమనార్హం.

**సమస్యలు పరిష్కరించిని ఐఏఎస్‌లను తలకిందులుగా వేలాడదీస్తా అని మధ్యప్రదేశ్ సీఎం అనడం ఎంతవరకు సమర్థనీయమంటారు?**

సమర్థనీయం కాదు. విపక్ష రాజకీయ పార్టీలు ఈ విషయంలో దుమ్మెత్తి పోస్తున్నాయి.అది రాజకీయ కోణం అనుకోండి. కాకా పోతే అతను అన్న సందర్భాన్ని బట్టి ఆ మాటలను అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది. రెవెన్యూ సంబంధ సమస్యలను సకాలంలో పరిష్కరించకపోతే ఉన్నతాధికారులను తలకిందులుగా వేలాడదీస్తానని మధ్యప్రదేశ్ సీఎం శివరాజ్ సింగ్ చౌహాన్ హెచ్చరించారు. ఇక్కడ ప్రజా సమస్యలు సకాలంలో పరిష్కరించాలనే తపనతో ఆయన అలా అని ఉండవచ్చు. రైతులకు సంబంధించిన రెవెన్యూ విషయాల్లో ఆలస్యం చేయకూడదని.. అలాచేస్తే కఠిన చర్యలు తీసుకోవాల్సి ఉంటుందని మాత్రమే హెచ్చరించారని అధికార పక్షం వివరణ ఇచ్చింది కూడా. ఏది ఎలా ఉన్నా.. ఉన్నతాధికారుల పట్ల ముఖ్యమంత్రి అమర్యాదకరంగా మాట్లాడటం సబబు కాదు. ఇక్కడ మనం ఒక్క విషయం గమనించాలి.ఇటీవలి కాలంలో ప్రజలకు, ప్రభుత్వాలకు మధ్య అధికారులు నలిగిపోతున్నారనేది అక్షర సత్యం.

**సార్.. టోల్ ప్లాజాల వద్ద వీవీపీల లేన్లను రద్దు చేయాలని ఉత్తర్రపదేవ్ ప్రభుత్వం నిర్ణయించిందట కామెంట్ ప్లీజ్!**

యూపీ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం సరైందే. వీఐపీ కల్చర్‌కు చెక్ పెట్టాలనే ఉద్దేశ్యంతోనే బుగ్గకార్లకు కేంద్రం తిలోదకాలిచ్చింది. వీఐపీ కల్చర్ వద్దనుకున్నప్పుడు, టోల్ ప్లాజాల వద్ద వీవీఐపీలకు ప్రత్యేక లైన్లు ఏర్పాటు చేయడం అనేది, మరో విధంగా వీవీఐపీ కల్చర్‌ను ప్రోత్సహించడమే అవుతుంది. అందుకే టోల్ ప్లాజాల వద్ద వీవీపీల కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసే లేన్లను రద్దు చేయాలని ఉత్తర్రపదేవ్ ప్రభుత్వం నిర్ణయించింది. ఎంపీలు, ఎమ్మెల్యేలు ట్రాఫిక్‌లో చిక్కుకోకుండా ఉపయోగించే ఈ లేన్లను ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తున్నారు. అయితే ప్రజలందరికీ అన్ని సౌకర్యాల్లో సమాన భాగం ఇస్తూ వీవీఐపీ సంస్కృతిని పక్కనబెట్టాలని యోగి ఆదిత్యనాథ్ ప్రభుత్వం యోచించడం నిజంగా అభినందనీయం.

## మెయిల్ అడ్రస్

SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

# సెటైర్

## లోగుట్టు..!

కార్యకర్తల అభీష్టం.....అభివృద్ధి...ప్రజా సేవ...ఇవే నేటి రాజకీయ నాయకులకు తారక మంత్రం. పార్టీ మారినా... తిరుగు బాటు చేసినా రాజకీయ నాయకుల నోటి నుంచి వచ్చే మొదటి మాటలు ఇవి. కార్యకర్తలతో చర్చించాక, వారి అభీష్టం మేరకు, నియోజక వర్గం అభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని, ప్రజలకు మరింత సేవ చేయాలనే ఉద్దేశ్యంతోనే పార్టీ మారుతున్నా..అంటూ మీడీయా ముందుకొచ్చి ఫిరాయింపు దారులు వల్లించే మాటలు ఇవే..అది జాతీయ పార్టీ కావచ్చు..ప్రాంతీయ పార్టీ కావచ్చు..జిల్లా స్థాయి నాయకుడైనా.. రాష్ట్ర స్థాయి లీడరైనా....ఆత్మరక్షణ కోసం వాడే మాటల తూటాలు ఇవి. ఈ తూటా దెబ్బలు తినితిని అదే నండి ఆ మాటలు విని విని విసుగెత్తిన జనం వారి మాటలు నమ్మడం ఏనాడో మరిచి పోయారనుకోండి. అయితే ఉదయం ఓపార్టీ కండువాను భూజాన వేసుకుని ఇంటిలోంచి వెళ్లిన లీడర్, రాత్రి అదే కండువాతో తిరిగి ఇల్లు చేరుతాడో లేదో, కొత్త కండువాతో గృహప్రవేశం చేస్తాడో తెలియని, రాజకీయ విలువలు దిగజారిన రోజులు కదా..నాయకులకు మాత్రం ప్రస్తుతానికి ఇవే మాటలు వల్లిస్తున్నారు. పట్టవు కాబట్టి వదిలేస్తున్నారు కాని, జనం చెవిలో ఏకంగా క్యాబేజీ పూలే పెట్టేవారు. ఏంటి ఈ కండువాల పురాణం, మాటల దుకాణం దేనికని సందేహిస్తున్నారా? అక్కడికే వస్తున్నా. బీహార్ ముఖ్యమంత్రిగా ఉన్న నితీష్ కుమార్, కాంగ్రెస్, ఆర్జేడీ, జేడీయూలతో కూడిన మహా కూటమి ప్రభుత్వానికి రాత్రికి రాత్రే గుడ్‌బై చెప్పారు. సీఎం పదవికి రాజీనామా చేసి, 24 గంటలు తిరిగే లోపే తిరిగి సీఎంగా పదవీస్వీకార ప్రమాణం చేసిన నితిష్ కూమార్‌జీ నోట మళ్లీ ఇవే మాటలు వినిపించాయి. అభివృత్తి మంత్రి పఠించారు. బీహార్ అభివృద్ధి కోసమే బీజేపీతో చేతులు కలిపినట్లు సీఎం నితీష్‌కుమార్ స్పష్టం చేశారు. ఆర్జేడీకి గుడ్‌బై చెప్పిన నితీష్.. బీజేపీ ఎమ్మెల్యేల మద్దతుతో కొత్తగా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన విషయం విదితమే. ఆ రాష్ట్ర సీఎంగా ఆరోసారి ప్రమాణస్వీకారం చేసిన అనంతరం నితీష్ మీడియాతో మాట్లాడారు. బీహార్ అభివృద్ధే తన ధ్యేయమని స్పష్టం చేశారు. బీజేపీతో పొత్తులో తప్పేమీ లేదంటూ తన చర్యను సమర్థించుకున్నారు. అంతేకాదు బీహార్ అభివృద్ధికి నితీష్ తో పాటు బీజేపీ ప్రాధాన్యం ఇస్తుందని డిప్యూటీ సీఎం సుశీల్ మోదీ స్పష్టం చేశారు. బీహార్ అభివృద్ధి బీజేపీతో సాధ్యమన్నారు. ఎంతో ఉన్నతమైన స్థానానికి బీహార్ త్వరలోనే చేరుకోబోతుందంటూ సుశీల్ మోదీ అభివృద్ధి మంత్రం జపించారు. మహాకూటమితో తెగతెంపులు చేసుకున్న తర్వాత నితీష్ కుమార్‌కు ప్రధాని మోదీ ట్వీటర్ ద్వారా శుభాకాంక్షలు తెలిపిన విషయం తెలిసిందే. బీహార్ పురోగతి, శ్రేయస్సు కోసం కలిసి పని చేద్దామని మోదీ పిలుపునిచ్చారు. అభివృద్ధి మంత్రం పాతదే అయినా.. నితీష్ కుమార్, మహా



కూటమితో తెగతెంపులు చేసుకున్న వెంటనే ప్రధాని మోదీ స్పందించిన తీరు, 2915 ఎన్నికలప్పుడు, ప్రస్తుతం నితీష్ కుమార్ వ్యవహార శైలి మాత్రం కొత్త ప్రశ్నలను సందిస్తున్నాయి. బీహార్ పురోగతికోసం కలిసి పనిచేద్దాం అని అనడం అంటే, బీజేపీతో దోస్తాన్ చేయని రాష్ట్రాలలో పురోగతి ఉండదా? లేక అలాంటి రాష్ట్రాల అభివృద్ధికి కేంద్రం సహకరించడం లేదా? అన్న సందేహాలు కల్గుతున్నాయి. అంతేకాదు తెగతెంపులు అయిన వెంటనే, నితీష్‌కు బీజేపీ మద్దతు ప్రకటించిందంటే, ఈ వ్యవహారం వెనుకు బీజేపీ ఉందా? లేక గోరికాడ నక్కలా ఎప్పుడు మహాకూటమి నుంచి నితీష్ విడిపోయే టైం కోసం కమల నాథులు కూచుక్కూర్చున్నారా? అన్న సందేహాలు ..రాజకీయ అనుభవం అంతగా లేని జనాలకు సైతం కల్గుతున్నాయి. ఇక ఆరో సారి సీఎంగా ప్రమాణ స్వీకారం చేసిన , నితీష్ కుమార్ మాటలు సవాలక్ష సందేహాలు కల్గిస్తున్నాయి. గత ఎన్నిక వేళ మహా కూటమితో చెట్టాపట్టాలు వేసుకుని తిరిగిన నితీష్ కుమార్, దాని మద్దతుతో సీఎం గెద్దె నెక్కిన సంగతి తెలిసిందే. అంటే దాదాపు రెండు సంవత్సరాలు సీఎంగా కొనసాగారు. మరి ఈ రెండు సంవత్సరాలు బీహార్‌లో అభివృద్ధి కుంటుపడిందా? లేక మహా కూటమిలో ఉన్నందుకు కేంద్రం సహకరించలేదా? ఎన్నికల అప్పుడు కానరాని అవినీతి పంకిలం.. నితీష్‌కు ఇప్పుడే కనిపించిందా? ఎందుకంటే ప్రస్తుతం నితీష్ రాజీనామాకు కారణం. తేజస్వీయాదవ్ మీద వచ్చిన అవినీతి అభియోగాలే అన్నది ఆయన వాగ్రుచ్చారు. అదే అసలు కారణమైతే, అలాంటి వారితో నితీష్ ఇంతకాలం ఎలా కలిసి అధికారం అనే కాపురం సాగించినట్లు? లేక అవినీతి వల్లే రాష్ట్ర అభివృద్ధి కుంటుపడిందని భావిస్తే, ఈ రెండు సంవత్సరాలు, తన పీఠం కాపాడు కోవడానికి నితీష్ కుమార్, ప్రజలను, రాష్ట్ర అభివృద్ధిని గాలికి వదిలేసారా? లేక బీజేపీతో లోపాయికారి ఒప్పందం కుదిరిన తర్వాత, తన పీఠం పదిలం అన్న గ్యారెంటీ దొరికాక పదవికి రాజీనామా చేశారా? అన్న సందేహాలు సర్వత్రా వ్యక్తం అవుతున్నాయి. నితీష్‌కుమార్ చెప్పినట్లు అవినీతి కేసుల్లో ఇరుక్కుపోయిన డిప్యూటీ ముఖ్యమంత్రి తేజస్వీ యాదవ్ రాజీనామాకు ససేమిరా అనడం, ఆయన్ని ఆర్జేడీ నాయకుడు లాలూ ప్రసాద్ యాదవ్ వెనకేసుకు రావడం తదితర పరిణామాలే మహా కూటమి ప్రభుత్వాన్ని కూల్చివేసిందనేది బయటకు కనిపించే అర్ధ సత్యం. కాని లోగుట్టు వేరే ఉందన్నది రాజకీయ విశ్లేషకులు వాదన. ప్రధాన మంత్రి నరేంద్ర మోదీకి ప్రత్యామ్నాయ నాయకుడిగా 2019 నాటి పార్లమెంట్ ఎన్నికల్లో ప్రతిపక్షాన్ని విజయపథాన నడిపించి ప్రధాన మంత్రి కావాలని నితీష్ కుమార్ కలలు కన్నారన్నది బహిరంగ రహస్యమే. ఈ విషయంలో ఇటీవలే రాహుల్ గాంధీతో జరిపిన మంతనాలు ఫలించలేదని, అందుకే ఆయన బీజేపీ పెద్దలతో మంతనాలు జరిపి కథను మార్చేశారన్నది అసలు సత్యమన్నది రాజకీయ పండితుల విశ్లేషణ. పేర్లు ఏవైనా, పార్టీలు ఏమైనా.. రాజకీయాల్లో శాశ్వత శత్రువులు ఉండరు. శాశ్వత మిత్రులు ఉండరు. అధికారమే రాజకీయ నాయకులు పరమావధి అనేది అక్షర సత్యం. ప్రధాన మంత్రి పదవి దక్కనప్పుడు ప్రస్తుతమున్న ముఖ్యమంత్రి పదవే ఎన్నో విధాల ఉత్తమం కదా!



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

## నవకవిత్వం

### నేను కవినెట్లైతా?

అన్నా.....నీలో మంచి కవి ఉన్నాడే!
అంటున్నారు మిత్రులు కొందరు...
కాని...నేను కవినెట్లైతా?... నేనే కవినైతే....
సినారె, శ్రీశ్రీ, గురజాడ మాటేంటి?
కావ్య కన్నియకు కొత్త ఆడుగులు నేర్పిన
గురజాడ గుండె ఆగిపోతుంది
శ్రీశ్రీ ఆత్మ, ఆత్మహత్య చేసుకుంటుంది
విశ్వంభరుడు సినారెకు మతిపోతుంది
అందుకే గట్టిగా అనొద్దంటున్నా..
కాకపోతే..... జర్నలిస్టుగా నే చూసింది,..
నా అనుభవంలోకి వచ్చింది..
అక్షర బద్ధం చేస్తున్నానే తప్ప,
నేను రాసేవి కవితలు కావు.
నేను కవిని అంతకన్నా కాను
నాది ఆధునిక కవిత్వం అంటారా..నాకా అర్హత ఎక్కడిది?
తోసింది రాసేసి, స్థోమతను బట్టి అచ్చువేసేసి.
వందిమాగదులను పిలుచుకుని....
ఆహా.. ఓహో.. అనిపించుకునే స్థోమత నాకెక్కడిది?
హోదాను అడ్డం పెట్టుకుని తాను రాసిన రాతలకు
పేరు పెట్టుకుని, అచ్చువేసుకునే అధికారం నాకెక్కడిది
అంతెందుకండీ బాబూ... నేను రాసిన పిచ్చిరాతలకు
నేనే ప్రచారం చేసుకుని,
ఆర్థిక చేయూత అందుకొని, బుక్కు ప్రింటేసే దైర్యమూ నాకు లేదు
అందేకే నాకు ఆధునిక కవిఅని పిలిపించుకునే అర్హతకూడా లేదు
చివరగా ఒక్కమాట..
నేడు కూడా సమాజ హితం కోసం కవిత్వం రాసే వాళ్లున్నారు
వారికి భజన బృందాల తోడు లేదు
అచ్చువేసే ఆర్థిక స్థోమత అంతకన్నా లేదు
ప్రోత్సాహం లేక మరుగున పడిపోతున్నారు
అలాంటి వారు తారస పడితే..
వారిని పొగడండి.....చేయూత నివ్వండి..
స్వార్థం నిండిన సమాజానికి కాస్త మేలైనా జరుగుతుంది.

***చారుశ్రీ, 7337088972***

## రన్నింగ్ వాయిస్




***ప్రత్యక్ష దైవాలు..***

ప్రత్యక్ష దైవాలకు ప్రణమామ్యహం..కవర్ స్టోరీ చాలా బాగుంది. మదర్స్ డే, ఫాదర్స్‌డే అంటూ తల్లి దండ్రులకు విడివిడిగా దినోత్స వాలు నిర్వహించడం బాగోలేదు.ఇద్దరికి కలిపి పేరెంట్స్ డే నిర్వహించ డమే సముచితం. మంచి కథనం అందించారు. థ్యాంక్స్..

***...శ్రీకాంత్ వర్మ, హైదరాబాద్***

***సెటైర్ బాగుంది..***

డ్రగ్స్ కేసు విషయంలో అధికారులు, ప్రభుత్వం చూపిస్తున్న ఈ దూకుడు కడదాకా ఉంటుందన్న నమ్మకం ప్రజలకు కూడా లేదు.ఇదంతా ఏదో స్టంట్ లాగా ఉంది.

....రాజు, విజయవాడ.

***కవిత బాగుంది.***

సార్..తెలంగాణ హరితహారం మీద ప్రచురించిన హరితహారం కవితి బాగుంది. రచయిత అశోక్ గారికి ధన్య వాదాలు. బంగారు తెలంగాణకు హరితం అనేది పచ్చల హారంలా భాసించాలని కాంక్షిద్దాం.

***....రమణ, ఉప్పల్, హైదరాబాద్***

***జీవితరాగాలు.***

కూనిరాగాలు.. బాగుంటున్నాయి. అవి కూనిరాగాలు కాదు..జీవిన రాగాలు..మనిషి జీ వితంలో జరిగే మార్పులు, చేసుకోవాల్సిన కూర్పులను చక్కగా వివరిస్తున్నాయి. రెడ్డిగారికి దన్యవాదాలు..

***....ఆచారి, నల్లగొండ***

***అందంగా ఉంది***

అలనాటి అందాల తారలు శీర్షికన మీరు ఇస్తున్న కథనాలు బాగుంటున్నాయి. మా అభినామ నటి, ఆంధ్రా అమితాబ్ గురించి ఇచ్చినందుకు కృతజ్ఞతలు

...రామచంద్ర, కర్నూలు.

***ఆలయం బాగుంది.***

ఆలయం శీర్షికన నవ్యాంధ్రలో పురాతన బ్రహ్మాలయం గురించి చక్కగా వివరించారు. తెలుగు రాష్ట్రాల్లో ఇంకా చాలా పురాతన ఆలయాలు ఉన్నాయి. వాటిని గురించి కూడా పాఠకులకు అందించండి.

***...రామబ్రహ్మం, మెదక్***

## 'కూని'రాగాలు

కాలంతో కాంక్షలు పరుగుపెట్టకూడదు..!
వయసులో కోరికలు హద్దులు దాటకూడదు..!!

అమాయకత్వాన్ని ఆసరాకు వాడుకోవద్దు..!
ధీరత్వాన్ని అన్నివేళలా ప్రదర్శించవద్దు..!!

శిక్షించడానికి కారణం చెప్పితీరాలి..!
రక్షించడానికి వివరణ అవసరంలేదు...!!

స్వభావాలను బేరీజు వేయడం రావాలి..!
అంతరాలను అంచనా వేయడం తెలియాలి..!!

మనసుకు చాంచల్యం నేర్పకూడదు..!
సొగసుకు ఆడంబరం అడ్డకూడదు..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

ఫన్ చ్




నారు

జ్ఞానం, విజ్ఞానం సంపాదించుకోవాలని అందూ అభిలషించేవారే. అయితే వాటికి మూల్యం చెల్లించడానికి ఇష్టపడేవారెవ్వరూ లేరు. -జువెనల్

# శ్రావణమాసం



శ్రావణమాసం మహిళలకు అత్యంత ముఖ్యమైనది. ప్రీతి పాత్రమైనది కూడాను. మహిళలు పాటించే వ్రతాల్లో అధికం ఈ మాసంలోనే ఉండడంవల్ల వ్రతాలమాసమని, సౌభాగ్యాన్ని ప్రసాదించే మాసమని కూడా శ్రావణమాసాన్ని పేర్కొంటారు. అంతే కాదు మహిళలకు సౌభాగాన్నిచ్చే వ్రతాలు ఎక్కువగా ఈ మాసంలోనే వస్తాయి. అందుకే ఈ మాసమంతా మహిళల్లో భక్తి భావం పొంగి పొర్లుతుంది. నిత్యం మంగళ స్నానాలతో ముత్తైదువులు కళకళాడుతుంటారు. ఏ ఇంటిలో చూసినా వ్రతాలు నోములతో ఆధ్యాత్మిక భావం పొంగి పొర్లుతుంది. అందుకే మహిళలకు సౌభాగ్యానిచ్చే శ్రావణ మాస వ్రతాలు ఏంటో తెలుసుకుందాం.

***మంగళగౌరీ వ్రతం....***

శ్రావణమాసంలో ఆచరించే వ్రతాల్లో ముఖ్యమైనది ఈ వ్రతం. ఈ వ్రతాన్ని కొత్తగా పెళ్ళయిన ముత్తదువలు చేయాలి. నెలలోని అన్ని మంగళవారాలు దీనిని చేస్తే మంచిది. ఆశించిన శుభఫలితాలు లభిస్తాయి.

***వరలక్ష్మీ వ్రతం...***

మహిళలకు అత్యంత ముఖ్యమైన శ్రావణమాసంలో ఆచరించే మరో ప్రధానమైన వ్రతం శ్రీ వరలక్ష్మీ వ్రతం. దీనిని పూర్ణిమ ముందు వచ్చే శుక్రవారం ఆచరిస్తారు. దీని వలన కుటుంబం సిరిసంపదలతో తులతూగుతుందని మహిళల విశ్వాసం. ఇక శ్రావణమాసంలో వచ్చే పండగల విషయాలనికి వస్తే..

***శుక్లచవితి-నాగులచవితి...***

మన రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో ఈరోజు నాగులచవితి పండుగను జరుపుకుంటారు. ఉపవాసం ఉండి పుట్ట వద్దకు వెళ్ళి పాలు పోసి పూజిస్తారు. శుక్ల ఏకాదశి-పుత్రదా ఏకాదశి. ఈ ఏకాదశికే లలితా ఏకాదశి అని కూడా పేరు. పుత్ర సంతానం కావాలనుకునేవారు ఈనాడు ఏకాదశీ వ్రతాన్ని ఆచరించడం మంచిది.

శ్రావణ పూర్ణిమ - రాఖీపూర్ణిమ..

అన్నా చెల్లెళ్ల అనుబంధానికి ప్రతీక ఇది. సోదరుడి సుఖసంతోషాలు కోరుతూ అక్కాచెల్లెళ్ళు సోదరుడి చేతికి రాఖీ కడతారు నుదుట బొట్టు పెట్టి.అనంతరం మిఠాయిలను తినిపిస్తారు. సోదరుడు సోదరి ఆశీర్వాదం తీసుకుని కానుకలివ్వడం ఆనవాయితీ. అంతే గాక ఈ దినం పాత యజ్ఞోపవీతాన్ని విసర్జించి కొత్తది ధరించడం ఆచారం.

పూర్ణిమ - హయగ్రీవ జయంతి..

వేదాలను రక్షించేందుకు శ్రీమహావిష్ణువు హయగ్రీవ రూపం ధరించినట్లు పురాణ కథనం.హయగ్రీవ జయంతి ఐన ఈ రోజు హయగ్రీవుడిని పూజించి శనగలు,ఉలవలతో గుగ్గిళ్ళు తయారుచేసి నైవేద్యం సమర్పిస్తారు. దీని వల్ల సకల శుభాలు కల్గుతాయి.





***కృష్ణవిదియ- శ్రీ రాఘవేంద్రస్వామి జయంతి ..***

క్రీ.శ.1671 వ సంవత్సరంలో విరోధికృత నామ సంవత్సరం శ్రావణ బహుళ విదియనాడు శ్రీ రాఘవేంద్రస్వామివారు సజీవంగా సమాధిలో ప్రవేశించారు. రాఘవేంద్ర స్వామి భక్తులకు ఇది చాలా పవిత్రమైన రోజు.

***కృష్ణపక్ష అష్టమి - శ్రీకృష్ణాష్టమి..***

దీనినే జన్మాష్ఠని అని కూడా పిలుస్తారు. శ్రీమహావిష్ణువు ధరించిన అవతారాల్లో ఎనిమిదో అవతారమైన శ్రీకృష్ణ పరమాత్మ జన్మించిన దినం. దీనినే కృష్ణాష్టమి లేదా జన్మాష్టమి అని పేర్లు. ఈ రోజు పగలంతా ఉపవాసం ఉండి సాయంత్రం కృష్ణుడిని పూజించి నైవేద్యంగా పాలు, పెరుగు , మీగడ, వెన్నలను సమర్పించడం ఆచారం.ఇదే రోజు సాయంత్రం ఉట్లు కొట్టడే ఆచారం ఉంది. ఈ ఉట్లు కొట్టే వేడుక చూడముచ్చటగా ఉంటుంది.

***కృష్ణపక్ష ఏకాదశి - కామిక ఏకాదశి...***

ఈ దినం ఏకాదశీ వ్రతం, ఉపవాసాలను పాటించడంతో పాటు నవనీతమును దానం చేయడం మంచిది.ఈ ఏకాదశీ వ్రతాన్ని పాటించడం వల్ల మనసులో ఉన్న కోరికలన్నీ నెరవేరుతాయని శాస్త్ర వచనం.

***కృష్ణపక్ష అమావాస్య - పోలాల అమావాస్య***

ఇది వృాఎషభాలను పూజించే పండుగ. కాగా కాలక్రమేములో పోలేరమ్మ అనే గ్రామ దేవతలను ఆరాధించే పర్వదినంగా మార్పు చెందింది. ఇది ఆచరించడం వల్ల పిల్లలకు అకాల మృత్యు భయం తొలగిపోతుంది అని శాస్త్రాలు చెబుతున్నాయి.

---

# సెల్ఫీ తీసుకుంటున్నారా...? ఈ యాప్స్ మీ కోసమే !

సెల్ఫీలంటే మీకు ఆసక్తా..?, ఎంతో ఇష్టపడి మీ స్మార్ట్‌ఫోన్ నుంచి తీసుకునే సెల్ఫీ అంతగా ఆకట్టుకోవటం లేదా? డోంట్ వర్రీ.. గూగుల్ ప్లే స్టోర్‌లో మీకోసం ఎన్నో యాప్స్ రెడీగా ఉన్నాయి. ఆ యాప్స్ ద్వారా మీరు సెల్ఫీ తీసుకున్నట్లయితే, నలుగురిలో మీ సెల్ఫీ మరింత క్రియేటివ్‌గా కనిపిస్తుంది. ఈ యాప్స్‌లో సెల్ఫీలను నచ్చిన విధంగా ఎడిట్ చేసుకుని సోషల్ మీడియాలో షేర్ చేసుకునే ఆప్షన్ కూడా ఉంటుంది. గూగుల్ ప్లే స్టోర్ నుంచి వీటిని ఫ్రీగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. గూగుల్ ప్లే స్టోర్‌లో సిద్ధంగా ఉన్న పది బెస్ట్ సెల్ఫీ యాప్స్‌ను ఇప్పుడు చూద్దాం.

స్వీట్ సెల్ఫీ...ఇది బెస్ట్ ఆండ్రాయిడ్ సెల్ఫీ కెమెరా యాప్. మీకు పర్ఫెక్ట్ సెల్ఫీ కావాలంటే ఈ యాప్ నుంచి తీసుకోవచ్చు. దీంట్లో రకరకాలు ఎఫెక్ట్స ఉంటాయి. మీకు నచ్చిన విధంగా ఫిల్టర్ చేసుకోవచ్చు. అంతేకాదు ఏమోజీతో పాటు పవర్ ఫుల్ స్రీన్ ఫ్లాష్ ఉంటుంది. వెలుతురు సరిగ్గా లేకున్నా సెల్ఫీ పర్ఫెక్ట్‌గా వస్తుంది.

క్యాండీ కెమెరా... సెల్ఫీలు ఎక్కువగా తీసుకునే వారికి ఈ యాప్ ఉపయోగపడుతుంది. సెల్ఫీ తీసుకునే సమయంలో రియల్ టైమ్ ఎఫెక్ట్ లు, ఫిల్లర్లను అప్లై చేసుకునే సౌకర్యం ఉంటుంది. సెల్ఫీ ఎలా తీసుకున్నా...దాన్ని అందంగా ఆకర్షణీయంగా కనిపించేలా మార్చుకోవచ్చు. ఇందులో బ్యూటీ ఫంక్షన్, కొల్లేజ్ మోడ్ ఫీచర్లను అదనంగా అందిస్తున్నారు.

612-సెల్ఫీజెనిక్ కెమెరా.... ఈ యాప్ ద్వారా తీసుకున్న సెల్ఫీని మీకు నచ్చిన విధంగా సెట్ చేసుకోవచ్చు. అంతేకాదు మీ సెల్ఫీకి ఫన్ స్టిక్కర్స్‌ను కూడా యాడ్ చేసుకోవచ్చు. ఫోటో ఎఫెక్ట్ ఎక్స్రాట్రా కలర్‌తో ఫర్ఫెక్ట్‌గా కనిపిస్తుంది.

యూకామ్ పర్ ఫెక్ట్....ఇది బెస్ట్ ఆండ్రాయిడ్ కెమెరా సెల్ఫీ యాప్. ఈ యాప్‌ను గూగుల్ ప్లే స్టోర్ నుంచి మీ ఫోన్‌లోకి ఫ్రీగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. దీంతో మీరు స్టన్నింగ్ ఫోటోలు తీసుకోవచ్చు. ఇందులో మొత్తం ఆరు రకాల ఫ్రేమ్స్ ఉంటాయి. స్టిక్కర్స్, ఫన్ సీన్స్ ఉంటాయి. ఇది సెల్ఫీ తీసుకోవాలనుకునేవారికి బెస్ట్ యాప్ అని చెప్పొచ్చు.

బ్యూటీ ప్లస్..... ఈ యాప్‌ను వాడేవారి సంఖ్య వంద మిలియన్లు దాటిపోయింది. ఇది బెస్ట్ సెల్ఫీ యాప్ అని చెప్పొచ్చు. ఫేస్ పై ఎటువంటి మచ్చలు, పింపుల్స్ ఉన్నా వాటిని క్లియర్ చేస్తూ ఫోటో తీసుకోవచ్చు. అంతేకాదు బ్యూటీ ప్లస్‌లో తీసుకున్న ఫోటోస్‌ను ఫేస్‌బుక్, ఇన్‌స్టాగ్రామ్ , ట్విట్టర్‌లో షేర్ చేసుకోవచ్చు.

రిటక్రా..... ఈ యాప్‌లో మీకు రకరకాల వింటేజ్ విల్లాలు కనిపిస్తాయి. మీకు నచ్చిన విధంగా సెల్ఫీలు తీసుకోవచ్చు. అంతేకాదు ఇందులో వంద రకాల స్టిక్కర్స్ కూడా ఉంటాయి. మీరు తీసుకున్న సెల్ఫీని వీటితో అందంగా డెకరేట్ చేసుకోవచ్చు.

బెస్ట్ మీ సెల్ఫీ కెమెరా..... ఈ యాప్‌లో రకరకాల ఫన్నీ స్టిక్కర్స్ ఉంటాయి. ఏమోజీ స్టిక్కర్స్‌తో సెల్ఫీలు తీసుకోవచ్చు. ¬

హెచ్ డి సెల్ఫీ కెమెరా.... ఈ యాప్ ద్వారా పర్ఫెక్ట్ సెల్ఫీ తీసుకోవచ్చు. కలర్ ఎఫెక్ట్స్‌తో పాటు జీపీఎస్ లొకేషన్ కూడా మీరు తీసుకునే సెల్ఫీలకు , సెల్ఫీ వీడియోలకు ట్యాగ్ చేసుకోవచ్చు. ¬

ఎల్ఫీ సిటీ ...ఈ యాప్‌ను ప్రొఫెషనల్ ఆరిస్టులు తయారు చేశారు. మూవీ థీమ్‌తో ఈ యాప్ వస్తుంది. బ్యాక్ గ్రౌండ్ బ్లర్ చేసుకునే ఆప్షన్ కూడా ఉంది. దీన్ని గూగుల్ ప్లేస్టోర్ నుంచి డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

మేకప్ ప్లస్....ఈ యాప్ ఎక్కువగా మహిళలకు ఉపయోగపడుతుంది. మేకప్‌తో సెల్ఫీ తీసుకునేందుకు ఇది బెస్ట్ యాప్ అని చెప్పొచ్చు.



అలవాటు అనేదాన్ని అరికట్టకపోతే, అది త్వరలోనే ఒక అవసరంగా మారిపోతుంది.-సెయింట్ ఆగస్టన్

# రాశీఖన్నాతో వరుణ్ తేజ్ లండన్ ట్రిప్



ఫిదాతో మంచి సక్సెస్‌ను అందుకున్నాడు వరుణ్‌తేజ్. సో.. ఫిదా సక్సెస్‌ను ఎంజాయ్ చేసేందుకు వరుణ్ తేజ్ లండన్ ట్రిప్ ప్లాన్ చేశాడు. అయితే పనిలో పనిగా ఈ హాలీడే ట్రిప్‌నే ప్రొఫిషనల్ టూర్‌గా మార్చేశాడు. వరుణ్ తాజాగా తన అప్ కమింగ్ మూవీని భోగవల్లి ప్రసాద్ బ్యానర్‌లో చేయబోతున్నాడు. ఈ సినిమా షూటింగ్ కోసం టీమ్ మొత్తం లండన్ వెళ్లబోతుందని సమాచారం. త్వరలోనే ఈ మూవీకి సంబంధించిన పూర్తి వివరాలు ప్రకటించేందుకు చిత్ర యూనిట్ సన్నాహాలు చేస్తుంది. ఈ సినిమాలో వరణ్ తేజ్ సరసన ఢిల్లీబ్యూటీ రాశీఖన్నా నటించనుంది. బెంగాల్ టైగర్ తరువాత ఓ సరైన అవకాశం ఎదురుచూస్తున్న రాశీఖన్నాకు వరుణ్ తేజ్ సరసన ఛాన్స్ రావడం ఆమె కెరీర్ ప్లస్ అవుతుందని వార్తలు వస్తున్నాయి. ఈ నేపథ్యంలో వరుణ్ తేజ్ – రాశీ జోడీ ఎలా ఉండబోతుందో అని మెగా ఫ్యాన్స్ ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు. ఇక వరుణ్ కెరీర్‌లో చాలా రోజులు తరువాత ఫిదాతో తొలిరోజు మార్నింగ్ షోకి పాజిటివ్ టాక్ వచ్చింది. అయితే ఈ క్రెడిట్ మొత్తం హీరోయిన్ ఖాతాలో వేసేస్తున్నారు సినీజనాలు. అయితే మెగా ఫ్యాన్స్ సపోర్ట్ ఉండటంతో వరుణ్‌కి సైతం ప్రశంసలు వస్తున్నాయి. మొత్తానికి ఫిదా సక్సెస్‌ని రాశీఖన్నాతో లండన్‌లో చేసుకోబోతున్నారు మెగాప్రిన్స్ వరుణ్ తేజ్. మరి ఈ కొత్త సినిమాలో వరుణ్ ఏ తీరున అభిమానుల్ని అలరించనున్నాడో చూడాలి.



# చైతూ యుద్ధం దానికోసమేనా..?

నాగ చైతన్య తాజాగా నటిస్తున్న యుద్ధం శరణం చిత్రం ఫస్ట్ లుక్ కూడ విడుదల చేశారు చిత్ర యూనిట్. ఆ పోస్టర్ కు మంచి స్పందనే వచ్చింది. ఇప్పుడు మరో పోస్టర్ విడుదల చేసారు యుద్ధం శరణం టీమ్. ఈ సారి విడుదల చేసిన ఈ పోస్టర్ లో టిజర్ ఎప్పుడు విడుదలకాబోతుంది అని చెబుతూ టైటిల్ డిజైన్ లోనే ఏదో కథను చెప్పే ప్రయత్నం చేశారు. పోస్టర్ లో ఉన్న వ్యక్తులు బట్టి చూస్తే ఒక కుర్రాడికి చక్కని కుటంబం ఉంది అమ్మ నాన్నతో బలమైన అనుభంధం ఉంది. అలానే ఒక లక్ష్యం కూడా ఉంది. ఇలాంటి కుర్రాడికి అవసరమైన ప్రేమ కూడా ఉందనే ఉంది. అయితే ఈ ప్రేమ కుటంబ ప్రయాణంలో అతనికి కొన్ని అడ్డంకులు కూడా ఉన్నాయి అనిపిస్తుంది. శ్రీకాంత్ అండ్ మురలి శర్మ ఆ అడ్డంకులు సృాఎష్టిస్తే.. రావు రమేశ్ మరియు రేవతిలు బహుశా నాగ చైతన్య అమ్మ నాన్నలుగా నటించబోతునట్లు అర్ధం చేసుకోవచ్చు. మరి అతని లక్ష్య సాధనలో కొన్ని మలువులు వలన శ్రీకాంత్ తో తలపడివలిసి వస్తుంది కాబోలు. పోస్టర్ బ్యాక్ గ్రౌండ్లో ఇంటి స్ధలం కోసం వేసే ప్లాన్ కూడా ఉంది పెన్సిల్ డ్రాయింగ్తో. అంటే మనవాడు సివిల్ ఇంజినీరింగ్ కాబోలు. ల్యాండ్ గొడవలు లలో ఏదైనా సమస్య వచ్చి యుద్ధం చేస్తాడని అని మనం అనుకోవచ్చు. ఒక లావణ్య తో ప్రేమాయణం మరో యాంగిల్ అయితే.. అతను గాల్లోకి ఎగరేసే ఫ్లయ్ క్యామ్ అసలు సినిమాకే కీలకమైన యరో యాంగిల్. ఏదైనా కూడా సినిమా కొంచం కొత్తగానే ఉండబోతుందని అర్ధమవుతోంది. ఒక కుటంబం – ఒక అమ్మాయి ప్రేమ – ఒక లక్ష్యం – యుద్ధం చేయడానికి ఒక శత్రు సైన్యం సరిపోతాయి అనే అనిపిస్తుంది. రారాండోయి వేడుక చూద్దాం తరువాత నాగ చైతన్య నటిస్తున్న ఈ యుద్ధం శరణం సినిమాను సాయి కొర్రపాటి వారాహి చలన చిత్రం బేనర్ పై నిర్మిస్తున్నాడు. కృాఎష్ణ ఆర్ వి మరైముత్తు డైరెక్ట్ చేస్తున్నాడు. ఈ నెల జూలై 31 నాడు సినిమా టీజర్ విడుదలవ్వబోతోంది. అది సంగతి.

# ఆ విషయంలో ఎంజాయ్ చేయలేకపోయా!



తనకు పేరు తెచ్చిపెట్టిన తెలుగు సినిమాలను వదిలేసి బాలీవుడ్‌కు షిఫ్టయిపోయింది గోవా సుందరి ఇలియానా. టాలీవుడ్‌లో కొన్నేళ్లే ఉన్నా దాదాపు పెద్ద హీరోలందరి పక్కన నటించేసింది. జులాయి సినిమా తర్వాత టాలీవుడ్‌కు టాటా చెప్పేసింది. రణ్‌బీర్ కపూర్‌తో కలిసి చేసిన బర్ఫీ హిట్ కావడంతో హిందీలో సెటిల్ అయిపోతానని అనుకుంది. అడపాదడపాగా ఛాన్సులు వచ్చాయే తప్ప సౌత్‌లో లాగా స్టార్ హీరోయిన్ స్టేటస్ మాత్రం రాలేదు. అసలు సౌత్ సినిమాలు ఎందుకు వదిలేసినట్లు అన్నదానిపై ఇలియానా తాజాగా పెదవి విప్పింది. సౌత్‌లో నటించిన సమయంలో పెద్ద తప్పు చేశాను. ఒకేసారి బోలెడు సినిమాలకు కమిట్ అయిపోయాను. దీంతో క్షణం తీరిక ఉండేది కాదు. ఒక సెట్ నుంచి మరో సెట్‌కు పరుగులు తీసేస్తుండేదాన్ని. దీంతో ఫిలిం మేకింగ్‌ను సరిగ్గా ఎంజాయ్ చేయలేకపోయాను అని చెప్పుకొచ్చింది. కాకుంటే సౌత్ సినిమాల్లో ఎన్నో గ్లామర్ రోల్స్ చేశానని అవన్నీ తనకు ఎంతో నచ్చాయని చెప్పింది. ప్రస్తుతం ఇలియానా చేతిలో రెండు హిందీ సినిమాలు ఉన్నాయి. అజయ్ దేవగన్ హీరోగా మిలన్ లూథ్రియా దర్శకత్వంలో బాద్షాహో, అనీస్ బాజ్మీ డైరెక్షన్లో అర్జున్ కపూర్ హీరోగా వస్తున్న ముబారకన్ సినిమాల్లో ఇలియానా హీరోయిన్‌గా చేస్తోంది. బాలీవుడ్‌లో పాతుకుపోవాలన్న తన కలలు ఈ సినిమాలతో నెరవేరుతాయని గోవా భామ ఆశతో ఉంది.

# రిక్షా తొక్కిన రకుల్



ప్రస్తుతం తమిళ సినిమా ధీరన్ అధికరం ఒండ్రు సినిమా షూటింగ్ లో బిజీగా ఉంది హీరోయిన్ రకుల్ ప్రీత్ సింగ్. స్టార్ హీరోయిన్లు ఏం చేసినా అది న్యూస్ హెడ్ లైన్‌గా మారిపోతోంది. అయితే ఈ సినిమాలో రకుల్ రిక్షా తొక్కే సీన్ ఒకటి ఉంది. ఆ సీన్ కోసం రకుల్ రిక్షా తొక్కడం ప్రాక్టీస్ చేస్తుండగా తీసిన ఫోటోలు సోషల్ మీడియాలో వైరల్ అయ్యాయి. కార్తీ హీరోగా నటిస్తున్న ఈసినిమా షూటింగ్ ప్రస్తుతం వుదుచ్చేరిలో జరుగుతోంది. కోలీవుడ్ తో పాటు తెలుగు, హిందీ భాషల్లోనూ బిజీగా ఉంది రకుల్. మహేష్ బాబు హీరోగా తెరకెక్కుతున్న స్పైడర్ తో పాటు, జయ జానకీ నాయక సినిమాల్లో నటిస్తోంది. హిందీఓ సిద్దార్థ్ మల్హోత్రాకి జోడిగా అయారి లో నటిస్తోంది. వీటితో పాటు సూర్యకు జోడిగా మరో సినిమాలో నటించేందుకు అంగీకరించింది.

కొందరు విషయ పరిజ్ఞానం వల్ల మరికొందరు కార్యనిర్వహణ వల్ల విజయం సాధిస్తారు. కాని చాలా కొద్దిమంది మాత్రం ఏమిటో తెలుసుకోవడంలో విజేతలవుతారు. -ఎల్బర్ట్ హ్యూబర్డ్

మీకు తెలుసా...?

# పద్యం గురించి తెలుసుకుందాం..!

వేమన అందరికీ తేలికగా అర్థమయ్యే పదాలతో పద్యాలు రాసినవాడు వేమన. వేమనను ప్రజాకవి అంటారు. ఆయన సమాజంలో ఉండే మంచిమంచి విషయాలను గ్రహించి, వాటిని చిన్నపిల్లలు సైతం అర్థం చేసుకునే విధంగా చిన్నచిన్న పదాలతో శతకం రాశాడు. ప్రతిపద్యానికి చివర వాక్యం (దీనిని మకుటం అంటారు) విశ్వదాభిరామ వినురవేమ అని వస్తుంది. వేమన్న ఆశుకవి. ఆయన పద్యాలు ఆయన నోటిలోంచి ఆయన అభిమానుల లేదా శిష్యుల చెవుల్లోకి, వారి హృాఎదయాల్లోంచి తాటాకుల్లోకి ప్రవహించాయి.

***1.అల్పజాతివానికధికారమిచ్చిన***
***దొడ్డవారినెల్ల తొలగగొట్టు***
***చెప్పు తినెడు కుక్క చెరకు తీపెరుగునా?***
***విశ్వదాభిరామ! వినురవేమ!***

***పద్య అర్థం:...***

చెడ్డవాడికి అధికారం ఇస్తే మంచివారందరినీ (దొడ్డవారినెల్ల...) వెళ్లగొడతాడు. చెప్పులను ఎంతో ఇష్టంగా తినే కుక్కకు, చెప్పు రుచి కంటె చెరుకు రుచి చాలా తియ్యగా ఉంటుంది కదా అని పెడితే, దానికి ఆ చెరుకులోని తియ్యదనం తెలియదు. దాని నోటికి చెప్పుల రుచే తియ్యగా ఉంటుంది. అది దాని జాతి లక్షణం. అలాగే దుష్టుడై న వాడికి చెడుమాటలే బాగా నచ్చుతాయి. చెడ్డవారినే ఇష్టపడతాడు. తను చేసే చెడుపనులకు చెడ్డవారు మాత్రమే సహాయం అందిస్తారు. అందుకే అల్పజాతివానికి (దుష్టుడైన వానికి) పాలన అధికారం ఇచ్చిన వెంటనే ముందుగా మంచివారిని (దొడ్డవారినెల్ల) ఆయా పనులలోంచి తీసివేస్తాడు. సమాజంలో ఉండే మనుషుల ప్రవర్తనను జంతువుల



స్వభావంతో పోల్చి, చిన్నచిన్న పదాలతో ఉండే పద్యంలో చక్కగా వివరించాడు వేమన.

***2. బొంది ఎవరి సొమ్ము పోషింప పలుమారు***
***ప్రాణమెవరి సొమ్ము భక్తి సేయ***
***ధనము ఎవరి సొమ్ము ధర్మమే తన సొమ్ము***
***విశ్వదాభిరామ వినురవేమ***

ప్రస్తుతం నీది అనుకుంటున్నదేదీ నీది కాదు. అంటే ఎప్పటికీ నీతో ఉండేది కాదు అని చెప్తున్నాడీ పద్యంలో వేమన. శరీరం పట్ల అంత శ్రద్ధ తీసుకుంటున్నావెందుకు? అది ఎప్పుడూ ఇలాగే ఉంటుందా? జరా దుఃఖం ఉండనే ఉంది కదా! ప్రాణమూ అంతే! ఊపిరి ఎప్పుడు ఆగిపోతుందో తెలియదు.

భక్తిని కలిగి ఉండటమే చాలనుకుంటున్నావా? అది కాలయాపన కదా! జ్ఞాన యోగం ముఖ్యం. నువ్వు ఇప్పుడు ఆచరిస్తున్నవేవీ శాశ్వతం కాదు. ధనమూ అంతే! అది స్వార్జితమేనా? అది నీ చేతిలో ఎంత కాలముంటుందంటావు. ధర్మమొక్కటే నువ్వు పోయినా మిగిలి ఉండేది తెలుసుకొమ్మంటున్నాడు వేమన. బొంది అంటే దేహం. దీనికి బాల్యం, యౌవనం, వృాఎద్ధాప్యం. చివరికి మరణం అనే పరిణామముంది. కాబట్టి నువ్వు దానికి చేసే పోషణ తాత్కాలికమే. బొందితో కైలాసం వెళ్తారంటారు. అంటే సశరీర ముక్తి. అది నీకు సాధ్యమయ్యే పనేనా? బొంది దేశీయ పదం. కన్నడంలో కూడా బొంది. తమిళంలో పొంది. ప్రాణం అంటే ఆత్మ నుండి ఉద్భవించిన జీవశక్తి. అది మళ్లీ ఆత్మలోకే వెళ్లిపోతుంది. భక్తి సేయ అంటే భక్తిని చూపడం, ఆచరించడం. భక్తి అంటే అంకితభావం. ధనం కలకాలం ఉంటుందనుకోవడంలోనే నీ అజ్ఞానం ఇమిడి ఉంది. దానిని దానధర్మాలకు వెచ్చించడమే వివేకం.

---

# అలల తాకిడికి అదృశ్యమయ్యే టెంపుల్

అలల తాకిడికి అనుగుణంగా అదశ్యం అయిపోతూ, అంతలోనే కనిపిస్తూ ఉండే అరుదైన ఆలయం చూడాలంటే మాత్రం గుజరాత్లోని స్తంభేశ్వర టెంపుల్ ను దర్శించాల్సిందే! ఈ ఆలయం గుజరాత్లోని వడోదరా నుంచి 50 కిలోమీటర్ల దూరంలోని కవికంబోయి అనే గ్రామంలో ఉంది. అరేబియా సముద్రతీరంలో ఉన్న ఈ ఆలయం గురించి స్కందపురాణంలో కూడా ప్రసక్తి ఉందంటున్నారు ఆలయ నిర్వాహకులు. శివుని కుమారుడైన కార్తికేయుడు, తారకాసురుడు అనే రాక్షసుని సంహరించిన విషయం తెలిసిందే! తారకాసురుడు లోకకంటకుడే కావచ్చు. కానీ అతను మహాశివభక్తుడు. అలాంటి శివభక్తుని తన చేతులతో సంహరించినందుకు కార్తికేయుడు పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. తను చేసిన పనికి ఏదన్నా ప్రాయశ్చిత్తం చేసుకోవాలని తపించిపోయాడు. కార్తికేయుని దుగ్ధను గమనించిన విష్ణుమూర్తి శివభక్తుని పట్ల జరిగిన అపచారం శివపూజతోనే తొలగిపోతుందని సూచించాడు. అప్పుడు కార్తికేయుడు దేవతల శిల్పి అయిన విశ్వకర్మ చేత మూడు శివలింగాలను చెక్కించి వాటిని పూజించాడు. వాటిలో ఒక శివలింగమే స్తంభేశ్వర ఆలయంలోని మూలవిరాట్టు.

అలల తాకిడికి అనుగుణంగా అదశ్యం అయిపోతూ, అంతలోనే కనిపిస్తూ ఉండే అరుదైన ఆలయం చూడాలంటే మాత్రం గుజరాత్లోని స్తంభేశ్వర టెంపుల్ ను దర్శించాల్సిందే! ఈ ఆలయం గుజరాత్లోని వడోదరా నుంచి 50 కిలోమీటర్ల దూరంలోని కవికంబోయి అనే గ్రామంలో ఉంది. అరేబియా సముద్రతీరంలో ఉన్న ఈ ఆలయం గురించి స్కందపురాణంలో కూడా ప్రసక్తి ఉందంటున్నారు ఆలయ నిర్వాహకులు. శివుని కుమారుడైన కార్తికేయుడు, తారకాసురుడు అనే రాక్షసుని సంహరించిన విషయం తెలిసిందే! తారకాసురుడు లోకకంటకుడే కావచ్చు. కానీ అతను మహాశివభక్తుడు. అలాంటి శివభక్తుని తన చేతులతో సంహరించినందుకు కార్తికేయుడు పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. తను చేసిన పనికి ఏదన్నా ప్రాయశ్చిత్తం చేసుకోవాలని తపించిపోయాడు. కార్తికేయుని దుగ్ధను గమనించిన విష్ణుమూర్తి శివభక్తుని పట్ల జరిగిన అపచారం శివపూజతోనే తొలగిపోతుందని సూచించాడు. అప్పుడు కార్తికేయుడు దేవతల శిల్పి అయిన విశ్వకర్మ చేత మూడు శివలింగాలను చెక్కించి వాటిని పూజించాడు. వాటిలో ఒక శివలింగమే స్తంభేశ్వర ఆలయంలోని మూలవిరాట్టు.

***అలలకు అనుగుణంగా***

స్తంభేశ్వర ఆలయంలోని శివలింగం ప్రాచీనమైనదే అయినా, దీని చుట్టూ ఉన్న ఆలయాన్ని మాత్రం ఓ 150 ఏళ్ల క్రితమే నిర్మించారు. చాలా సాదాసీదాగా కనిపించే ఈ ఆలయం అద్భుత నిర్మాణం ఏమీ కాదు. కానీ ఈ ఆలయం వెనుక ఉన్న స్థలపురాణం వల్లనే వేలాదిగా భక్తులు ఇక్కడికి చేరుకుంటూ ఉంటారు. సముద్రపు అలలకు అనుగుణంగా ఈ ఆలయం కనిపించడం మరో విశేషం. అలలు తక్కువగా ఉన్నప్పుడు ఒకొక్క అంగుళమే ఈ ఆలయం బయటయపడుతూ చివరికి భక్తులు అందులోకి వెళ్లే అవకాశం లభిస్తుంది. మళ్లీ అదే క్రమంలో నిదానంగా సముద్రంలోకి మునిగిపోతుంది. ఆలయం బయటకు రావడం దగ్గర్నుంచీ సముద్రగర్భం లోకి వెళ్లిపోవడం వరకూ మొత్తం క్రమాన్ని గమనిం చేందుకు భక్తులు ఉదయం నుంచీ సాయంత్రం వరకూ తీరం వద్దనే వేచి ఉంటారు. చంద్రుని కళలను అనుసరించి ఒకో రోజు ఒకో



తీరుగా ఆలయం దర్శనమిస్తుంది. సముద్రం మంచి పోటు మీద ఉండే అమవాస్య/ పౌర్ణమి రోజులలో శివుని దర్శనం కోసం కాస్త ఎక్కువసేపు వేచి ఉండాల్సి వస్తుంది. ఇదీ స్తంభేశ్వర ఆలయ చరిత్ర. ఈ ఆలయాన్ని కావాలనే ఇలా నిర్మిం చారా లేకపోతే కాలక్రమేణా ఈ తీరుగా మారిందా అనేది చెప్పడం కష్టం. ఏమైనా శివుడు అభిషేక ప్రియుడు కాబట్టి నిత్యం ఆ సముద్రుడే ఆయనకు అభిషేకించి తరిస్తున్నాడని భావించవచ్చు. ఈ ఆలయం సమీపంలోనే మహీనది అరేబియా సముద్రంలో కలవడం మరో విశేషం. ఆ సంగమ ప్రాంతంలో స్నానాలు చేసి స్తంభేశ్వరుని దర్శిం చుకునేందుకు వేలాదిమంది ఇక్కడకు చేరుకుంటారు. శివపుత్రుడైన కార్తికేయుడు ఇక్కడి శివలింగాన్ని పూజించి సర్వదోషాల నుంచి విముక్తుడైన విధంగానే... ఈ లింగాన్ని దర్శించుకున్నవారు కూడా తెలిసీతెలియక చేసిన తప్పుల నుంచి విముక్తులవుతారని భక్తుల నమ్మకం.



**అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్**

# సాయి పల్లవి





ఒకే ఒక్క సినిమా ఒక అమ్మాయిని ఓవర్ నైట్ స్టార్ ని చేసేసింది. తెలుగులో ఇప్పటి వరకు ఒక్క సినిమాతో ఓవర్ నైట్ స్టార్ అయిపోయిన హీరోలని జనాలు చూసారు. కాని ఒక హీరోయిన్ స్టార్ కావడం ఫస్ట్ టైం చూస్తున్నారు. తెలుగు రాష్ట్రాల్లో ఎవరి నోట విన్న సాయి పల్లవి సాయి పల్లవి అనే మాట తప్ప మరో మాట వినిపించడం లేదు. ఆమె అలా చేసింది. ఇలా చేసింది. ఇరగదీసింది అనే స్పందనలు తప్ప మరో వాయిస్ ఎక్కడ వినిపించడం లేదు. కుర్రాళ్ళయితే ఉన్నపళంగా సాయి పల్లవికి ఫ్యాన్స్ గా మారిపోయారు. మాకు సాయి పల్లవి లాంటి అమ్మాయి పెళ్ళాంగా కావాలి అనే మాటలతో ఆమె మీద అభిమానం చాటుకుంటున్నారు. ఫిదా సినిమాలో ఆమె నటనకి ఆడియన్స్ ఫుల్ ఫిదా అయిపోయారు. తెలుగు ఇండస్ట్రీలో ఒకప్పుడు సావిత్రి, తరువాత సౌందర్య, మరల ఇన్నేళ్ళ తర్వాత సాయి పల్లవి మాత్రమె అనేంతగా ఆమె గురించి ఇప్పుడు తెలుగు సినిమా అభిమానులు చెప్పుకుంటున్నారు. సాయి పల్లవి లుక్స్ కి యాక్టింగ్ కి కుర్రాళ్ళు ఫిదా కావడం ఫస్ట్ టైం కనిపించింది. అది కూడా ఎలాంటి గ్లామర్ ఎక్స్ పోజ్ లేకుండా. ఇప్పుడు తెలుగులో సాయి పల్లవి ఇమేజ్ ని అందరు కాష్ చేసుకునే ప్లాన్ లో ఉన్నారు. ఇప్పటికే దిల్ రాజు సాయి పల్లవికి ఫిదా అయిపోయి మూడు సినిమాలు కాంట్రాక్టు చేసుకున్నాడు. నేచురల్ స్టార్ నాని నెక్ట్స సినిమా ఎంసిఎ లో సాయి పల్లవి ఫైనల్ అయినట్లు తెలుస్తుంది. మరో వైపు దిల్ రాజు బ్యానర్ లో సుదీర్ వర్మ, శర్వానంద్ కాంబినేషన్ సినిమాలో సాయి పల్లవిని ఫైనల్ చేసే ప్రదర్శించే కథానాయికల జాబితాలో సాయిపల్లవి కూడా చేరిపోయింది. ఫిదా సెట్స్ పై ఉండగానే ఈ అమ్మాయి టాలెంట్ గురించి తెలిసి, నాని సరసన మిడిల్ క్లాస్ అబ్బాయి సినిమా కోసం తీసుకున్నారు. ఈ సినిమాకి కూడా దిల్ రాజు నిర్మాతగా వ్యవహరిస్తున్నారు. ఈ సినిమా తరువాత శర్వానంద్ జోడీగా ఈ అమ్మాయిని ఎంపిక చేసే అవకాశం ఉందనే టాక్ వినిపిస్తుంది.









పరిపాలించడంకన్నా, ఒకరికి విధేయుడుగా వుండటమే అన్ని విధాల ఉత్తమం. -థామస్ ఎ.కెంపిస్

# మనీ విషవలయంలో మనిషి

ప్రపంచ వ్యాప్తంగా మనీ విషవలయంలో చిక్కి మనిషి విలవిలలాడి పోతున్నాడు. మానవ సంబంధాలు చిక్కిశల్యమవుతున్నాయి. ధనార్జనే ధ్యేయంగా మారిపోయింది. పాము తనకు పుట్టిన పిల్లలను తానే తిన్నట్లు, మనిషి తనతోనే తాను వ్యాపారం చేస్తున్నాడు. పాములు కూడా కేవలం డెలివరీ సమయంలోనే ఓ రకమైన మత్తులో మాత్రమే తన పిల్లలను తింటుంది. ఆ సందర్భం దాటి పోతే ఇక పాముపిల్లలకు పామువల్ల ఎలాంటి ప్రమాదం ఉండదు. కాని మనిషి అలా కాదు. మనీ కోసం ఏక్షణమైనా తోటి మనిషితో వ్యాపారం చేసేలా దిగజారి పోయాడు. వస్తువుల మాదిరిగా మానవుల అక్రమ రవాణా సాగుతుందంటే..? మనిషి మనిషిగా కాకుండా మనీ మృగంగా ఎలా మారి పోయాడో అర్థం చేసుకోవచ్చు. అంతర్జాతీయ మానవ అక్రమ రవాణా దినోత్సవం నిర్వహించుకోవాల్సిన పరిస్థితితులు దాపురించాయంటే, మనిషి ఎంతటి క్రూరంగా ప్రవర్తిస్తున్నాడో ఇట్టే అర్థమై పోతోంది. వివరాల్లోకి వెళితే.. ప్రపంచంలో మానవ జాతిని అత్యంత దుస్థితికి తీసుకు వెళ్ళే అనైతిక అవ్యవసీకృత నేరపూరిత వ్యాపారాలు ముఖ్యంగా మూడు. అవి... మాదకద్రవ్యాల వ్యాపారం, మానవ అక్రమ రవాణా, అక్రమ ఆయుధ వ్యాపారం. అంతర్జాతీయ నేరాల్లో అక్రమ రవాణాది మొదటిస్థానం. విలువ 15వేల కోట్ల డాలర్లు. ఆడ, మగ, పిల్లలు అనే తేడా లేకుండా ఈ అక్రమ రవాణా యథేచ్ఛగా సాగిపోతోంది. మహిళలను సెక్స్ వర్కర్స్ గాను, పిల్లల్ని వెట్టి చాకిరీలోకి దిగజారుస్తున్నారు. ప్రపంచంలో మానవ అక్రమ రవాణాది మూడవ ముఖ్యమైన అధికసంపాదన

> ప్రపంచ వ్యాప్తంగా మనీ విషవలయంలో చిక్కి మనిషి విలవిలలాడి పోతున్నాడు. మానవ సంబంధాలు చిక్కిశల్యమవుతున్నాయి. ధనార్జనే ధ్యేయంగా మారిపోయింది. పాము తనకు పుట్టిన పిల్లలను తానే తిన్నట్లు, మనిషి తనతోనే తాను వ్యాపారం చేస్తున్నాడు. పాములు కూడా కేవలం డెలివరీ సమయంలోనే ఓ రకమైన మత్తులో మాత్రమే తన పిల్లలను తింటుంది. ఆ సందర్భం దాటిపోతే ఇక పాముపిల్లలకు పామువల్ల ఎలాంటి ప్రమాదం ఉండదు. కాని మనిషి అలా కాదు. మనీ కోసం ఏక్షణమైనా తోటి మనిషితో వ్యాపారం చేసేలా దిగజారి పోయాడు.



అంటే బిలియన్ల డాలర్లు అందిస్తున్న వ్యాపారం. మొదటి రెండు స్థానాల్లో మాదకద్రవ్యాలు, అక్రమ ఆయుధ వ్యాపారం ఆక్రమించాయి. మానవ అక్రమ రవాణా అంటే దుర్మార్గపు పద్ధతుల్లో దోపిడీ చేసే ఉద్దేశంతో మోసం, నయవంచన, బలప్రయోగం ద్వారా తోటి మానవులను దురాక్రమణ ద్వారా ఆదీనము లోకి తెచ్చుకోవటం. ఇది ఇలాగే కొనసాగితే అనంతర్జాతీయ మనుగడకే పెను ప్రమాదం పొంచి ఉంది.



దీంతో మానవ అక్రమ రవాణాకు చెక్ పెట్టేందుకు 2013 లో ఐఖ్య రాజ్య సమితి జనరల్ అసెంబ్లి మానవ అక్రమ రవాణా వ్యతిరేఖ దినంగా జూలై 30 ని నిర్ణయించారు. ఈ నేపథ్యంలో మానవ అక్రమ రవాణా, దుష్ప్రభావాలు, అరికట్టే చట్టాలు, వాటి ప్రభావం, అంతర్జాతీయంగా మానవ అక్రమ రావాణా తీరు తెన్నులు ఎలా ఉన్నాయో ఓ సారి పరిశీలిద్దాం.!

### మానవ అక్రమ రవాణా అంటే..?

మానవులను అక్రమంగా ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి తరలించడాన్ని కూడా మానవ అక్రమ రవాణాగా పిలుస్తున్నారు.కాని అది సరైంది కాదు. ఎందుకంటే ఇలా సరిహద్దు దాటి అక్రమంగా వచ్చిన వ్యక్తి తమ గమ్యస్థానంలో స్వేచ్ఛను పొందుతాడు. భారమైన పరిస్థితుల నుంచి ఒక వ్యక్తిని కాపాడటానికి కూడా ప్రజల అక్రమ రవాణాను ఉపయోగించవచ్చు. ఉదాహరణకు, దక్షిణ అమెరికా సంయుక్త రాష్ట్రాలు బానిసత్వాన్ని అనుమతించినప్పుడు, అనేక మంది బానిసలు భూగర్భ రైలురోడ్డు ద్వారా ఉత్తర ప్రాంతానికి తరలివెళ్లారు. ఇదే విధంగా, హోలోకాస్ట్ (మహాబలి) సమయంలో, జర్మనీ నుంచి యూదు పౌరులను అల్గోథ్ నిస్కా వంటి పౌరులు అక్రమంగా రవాణా చేశారు. కాని మానవ అక్రమ రవాణా ద్వారా వచ్చిన బాధితుడు ఏదో ఒక మార్గంలో బలవంతానికి గురవతాడు. అక్రమంగా జరిగే రవాణా బాధితుల అంగీకారంతో జరగదు.మోసగించి, తప్పుడు వాగ్దానాలతో మభ్యపెట్టి లేదా బలవంతంగా వీరిని అక్రమ రవాణా చేస్తుంటారు. వంచన, మోసం, భయపెట్టడం, వేరుచేయడం, భౌతిక బెదిరింపులు మరియు బలాన్ని ఉపయోగించడం మరియు అప్పుల్లో ఇరికించడం లేదా బాధితులను తమ నియంత్రణలో ఉంచుకునేలా మాదకద్రవ్యాలు తీసుకునేలా బలవంతం చేయడం తదితర బలవంతపు ఎత్తుగడలను అక్రమ రవాణాదారులు ఉపయోగిస్తున్నారు. ఎక్కువ మంది బాధితులు మహిళలుకాగా,కొన్నిసార్లు బాలలు, పురుషులు కూడా ఇతర బాధితులుగా ఉంటున్నారు, మహిళలు మరియు పిల్లలను బలవంతంగా లేదా కుట్రద్వారా శారీరక లేదా చవక కార్మికులుగా ఉపయోగిస్తున్నారు. అక్రమ రవాణా చట్టవిరుద్ధం కావడంతో, దీని యొక్క స్పష్టమైన పరిధి తెలియడం లేదు. 2003లో ప్రచురించబడిన ప్రభుత్వ నివేదిక అంచనా ప్రకారం, ప్రపంచవ్యాప్తంగా ప్రతిఏటా సరిహద్దులపై 800,000–900,000 మంది పౌరుల అక్రమ రవాణా జరుగుతుంది. అంతర్గతంగా అక్రమ రవాణా చేయబడుతున్న పౌరుల గణాంకాలు దీనిలో చేర్చలేదు.

ఒక అధ్యయనం ప్రకారం యెమెన్ యొక్క సరిహద్దు గ్రామాల్లో నివసిస్తున్న 30% మంది పాఠశాల బాలలను సౌదీ అరేబియాలోకి అక్రమ రవాణా చేస్తున్నట్లు వెల్లడించింది. ఇలా అక్రమ రవాణా చేసిన బాలలపై లైంగిక వేధింపులకు పాల్పడటం లేదా హత్య చేయడం చేస్తున్నారు. బాలల అక్రమ రవాణా వెనుక ఒక ప్రధాన కారణం పేదరికం, కొందరు బాలలను వారి తల్లిదండ్రుల అనుమతితోనే అక్రమ రవాణా చేయడం జరుగుతుంది. మానవ అక్రమ రవాణాలో 50% మంది బాలలే ఉంటున్నారు. ఫిలిప్పీన్స్‌లో, 60,000 నుంచి 100,000 మంది బాలలను వేశ్యా పరిశ్రమలో పనిచేయించేందుకు అక్రమ రవాణా చేస్తున్నారు. ఇటీవల సంవత్సరాల్లో తక్కువ ఆదాయ దేశాలకు చెందిన పౌరులు ఉద్యోగాల కోసం అభివృద్ధి చెందిన దేశాలకు వెళ్లాలని ఆకాంక్షిస్తుండటంతో ఈ అక్రమ రవాణా పెరిగిపోతుంది. వలసదారుల అక్రమ రవాణా మరియు మానవ అక్రమ వ్యాపారం రెండూ వేర్వేరు నేరాలు, కొన్ని ప్రధాన విషయాల్లో ఈ రెండింటికి మధ్య వ్యత్యాసాలు ఉన్నాయి. అక్రమ రవాణా ఒక వ్యక్తిని ఒక దేశంలో అక్రమ ప్రవేశం కల్పించడాన్ని సూచిస్తుంది, కాని ట్రాఫికింగ్ (మానవ వ్యాపారం)లో దోపిడి కూడా ఉంటుంది.ఇక ఇతర సరుకులు మాదిరిగా కాకుండా, మానవులను అయితే తిరిగి ఉపయోగించే వీలు ఉండటం మరియు మానవులను రవాణా చేయడానికి తక్కువ ములధన పెట్టుబడి మాత్రమే అవసరమవుతుండటంతో నేర సంస్థలు మానవులను అక్రమ రవాణా చేయడానికి ఎంచుకుంటున్నాయి. అంతేకాదు దీని వలన పెద్దఎత్తున మానవ హక్కులు ఉల్లంఘించబడుతున్నాయి, ఇది బానిసత్వం యొక్క ఒక సమకాలీన రూపంగా పరిగణించబడుతుంది. ప్రస్తుతం ఆర్థిక అస్థిరత ప్రపంచవ్యాప్తంగా అక్రమ వలసలకు ప్రధాన కారణంగా చెప్పబడుతుంది. సొంత ఆసక్తిపై వలస వెళ్లాలని కోరుకునేవారు తమ గమ్యస్థాన దేశానికి ప్రజల అక్రమ రవాణాలో ఆరితేరిన క్రిమినల్ సిండికేట్‌ల ద్వారా ప్రమాదకర ప్రయాణాలకు చేపడుతున్నారు. ఈ సిండికేట్‌లు వలసదారులకు అన్ని సమకూరుస్తారు, అయితే ఎక్కువ డబ్బు తీసుకుంటారు.

### అమానవీయ పద్ధతుల్లో మానవ అక్రమ రవాణా..

తరచుగా వీరు ప్రయాణించే పరిస్థితులు అమానవీయంగా ఉంటాయి. ట్రక్కుల్లో లేదా బోట్లలో వలసదారులను సామర్థ్యానికి మించి ఎక్కించి రవాణా చేస్తుండటంతో, తరచుగా ఘోర ప్రమాదాలు జరుగుతున్నాయి. గమ్యస్థాన దేశానికి చేరుకున్న తరువాత, వారు అక్రమంగా రావడం వలన రవాణాదారుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండాల్సి వస్తుంది. ఈ పరిస్థితిని ఆసరాగా చేసుకొని

> మానవులను అక్రమంగా ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి తరలించడాన్ని కూడా మానవ అక్రమ రవాణాగా పిలుస్తున్నారు.కాని అది సరైంది కాదు. ఎందుకంటే ఇలా సరిహద్దు దాటి అక్రమంగా వచ్చిన వ్యక్తి తమ గమ్యస్థానంలో స్వేచ్ఛను పొందుతాడు. భారమైన పరిస్థితుల నుంచి ఒక వ్యక్తిని కాపాడటానికి కూడా ప్రజల అక్రమ రవాణాను ఉపయోగించవచ్చు. ఉదాహరణకు, దక్షిణ అమెరికా సంయుక్త రాష్ట్రాలు బానిసత్వాన్ని అనుమతించినప్పుడు, అనేక మంది బానిసలు భూగర్భ రైలురోడ్డు ద్వారా ఉత్తర ప్రాంతానికి తరలివెళ్లారు.

వలసదారుల ప్రయాణానికి అయిన ఖర్చులను రాబట్టుకునేందుకు ఏళ్ల తరబడి అక్రమ కార్మిక మార్కెట్‌లో బలవంతంగా పని చేయిస్తున్నారు. మైనర్ బాలికల అక్రమ రవాణా ఒక్కసారిగా గత రెండు మూడేళ్ళలో పద్నాలుగింతలు పెరిగింది. ఈ అనైతిక మానవ రవాణాలో 76% వరకు మహిళలు మరియు మైనర్ బాలికలు ఉన్నారు. ఈ అక్రమ రవాణా ప్రపంచమంతా శరవేగంగా ప్రబలిపోతోంది. గత దశాబ్దం కంటే పెరిగి 2014 లో 65% పెరుగుదల నమోదుచేసింది. నేషనల్ క్రైం రికార్డ్స్ బ్యూరో విడుదల చేసిన వివరాల ప్రకారం బాలికలు, యువతుల రవాణా యే ముఖ్య లక్ష్యంగా జరిగే మానవ అక్రమ రవాణా మొత్తం లో 76% నమోదైంది. 2014 లో రికార్డులకెక్కి బహిరంగంగా ఈ చర్యకు గురైన మహిళలు, బాలికల సంఖ్య భారత దేశ వ్యాప్తంగా 8099. ఇందులో వ్యభిచారానికై అమ్మబడ్డ బాలికలు, మహిళలు, విదేశాలనుంచి దిగుమతైన మహిళలు, వ్యభిచారానికై కొనబడ్డ దేశీయ మహిళలు. లైంగిక దోపిడీ కై వీరినే యుద్ధం జరిగే ప్రాంతాలకు కూడా తరలిస్తారు. వ్యాపార ప్రయోజనాలకై లైంగిక దోపిడీ వివిధ పద్ధతుల్లో జరుగుతుంది . వివరాల్లోకి వెళితే.. బ్రోథల్ ప్రొస్టిట్యూషన్... ఒక గృహంలో వ్యభిచారం నిర్వహించటం. ఇది మహానగరాలలో అయితే రెడ్–లైట్ ఏరియా లుగా ప్రసిద్ధి. చాలా గ్రామాల్లో కూడా వ్యాపించి, అందరికి తెలిసిన వ్యవహారమే. సెక్స్ టూరిజం.... అనైతిక శృంగార యాత్ర అనేది వ్యభిచారం నేరంగా పరిగణించబడ్డ దేశాల నుండి అది నేరంగా పరిగణించని దేశాలకు తరలివెళ్ళేవారికోసం. ఉదాహరణకు యునైటెడ్ స్టేట్స్ లో వ్యభిచారం నేరం. కాని నేవడా ప్రాంతములో వ్యభిచారం చట్టబద్ధం. అందుకే నేవడా ఒక సెక్స్ టూరిస్ట్ ప్లేస్. అంటే సురక్షిత అనైతిక శృంగార యాత్రా స్థలం. అక్రమ రవాణా ద్వారా మహిళలను, బాలికలను అనేక ప్రాంతాల నుండి ఇక్కడికి రవాణా చేస్తారు. ఈ రొంపిలో వాళ్ళకు జీవితం గడచిపోతుంది. పోర్నోగ్రఫి....నీలి చిత్రాల, చలన చిత్రాల నిర్మాణం ఆడియో లేదా సిడిల ద్వారా అశ్లీల శృంగార వ్యాపారం లో ఇలా తరలించిన మహిళలను వినియోగించటం. ఇతర అనైతిక అవసరాలు: వెట్టిచాకిరి, మైనింగ్, ప్రైవేటు సైన్యం, టెర్రరిస్టుల తరఫున పోరాడేందుకు, అవయవాల వ్యాపారానికి, మాఫియా ముఠాల తరఫున బిచ్చగాళ్లుగా బానిసల్లా పనిచేసేందుకు కూడా మానవ అక్రమ రావాణా జరుగుతోంది.

### యూఎన్‌వో నివేదిక ప్రకారం..

ప్రపంచవ్యాప్తంగా కొనసాగుతున్న మానవ అక్రమ రవాణాకు సంబంధించి ఐక్యరాజ్యసమితికి చెందిన మాదక ద్రవ్యాలు, నేరాల నిరోధక కార్యాలయం విడుదల చేసిన ఓ నివేదికలో భయంకరమైన విషయాలు వెలుగుచూశాయి. వ్యభిచారం కోసం, నీలి చిత్రాల నిర్మాణం కోసం,








వెట్టిచాకిరి కోసమే కాకుండా గనుల మైనింగ్ కార్యకలాపాల్లో బానిసల్లా పనిచేసేందుకు, ప్రైవేటుసైన్యంలో, టెర్రరిస్టుల తరఫున పోరాడేందుకు మానవులను అక్రమంగా రవాణా చేస్తున్నారు. మాఫియా ముఠాల తరఫున బిచ్చగాళ్లుగా మారేందుకు కూడా మనుషులను అక్రమంగా రవాణా చేస్తున్నారంటే వళ్లు జలదరిస్తుంది. ఓ దేశంలోని ఓ ప్రాంతం నుంచి మరో ప్రాంతానికే కాకుండా, ఓ దేశం నుంచి మరో దేశానికి, ఓ ఖండం నుంచి మరో ఖండానికి కూడా ఈ అక్రమ రవాణా కొనసాగుతోంది. అక్రమ రవాణా దారులు భారతీయ మహిళలనే కాకుండా లైంగిక వ్యాపారాల కోసం ఉక్రైన్, ఝార్జియా, కజకిస్థాన్, ఉజ్బెకిస్థాన్, కైర్గిజిస్థాన్, అజర్బైజాన్, చైచన్యా, నేపాల్, థాయిలాండ్, మలేషియా లాంటి దేశాల నుండి బాలికలు, మహిళలను దిగుమతి చేసుకుంటున్నారని ఐఖ్యరాజ్యసమితి నివేదిక చెవుతుంది. మరో బాధాకరమైన విషయం ఏమిటంటే.. రవాణా అవుతున్న ప్రతి ముగ్గురిలో ఒకరు పిల్లలే ఉంటున్నారు. మొత్తం అక్రమ రవాణాలో 28 శాతం పిల్లలు ఉంటున్నారు. ఇక మహిళలు, బాలికలను కలుపుకొంటే 71 శాతం మంది ఉన్నారు. మహిళలను, బాలికలను సెక్స్–ట్రేడ్‌లోకి దించుతున్నారు, నీలి చిత్రాల నిర్మాణానికి ఉపయోగిస్తున్నారు. యువకులు, బాలురు, ఇతర మగవాళ్ళు–విషయానికి వస్తే వీరిని అక్రమ రవాణా చేసి, బాలలను ఎక్కువగా బిచ్చగాళ్లుగా మారుస్తున్నారు. యువకులను మైనింగ్‌లో పోర్టర్లుగా, వెట్టి చాకిరి కార్మికులుగా, ప్రైవేట్ సైనికులుగా అమ్ముతున్నారు. ప్రపంచ వ్యాప్తంగా అక్రమంగా రవాణా అవుతున్న 28 శాతం పిల్లల్లో సబ్–సహారా ఆఫ్రికా, మధ్య అమెరికా, కరేబియన్ ప్రాంతాల కు చెందిన పిల్లలే 62 నుంచి 64 శాతం ఉంటున్నారు. 2012 నుంచి 2014 ఏళ్ల మధ్య ప్రపంచవ్యాప్తం గా కొనసాగిన మానవ అక్రమ రవాణా వివరాలను సేకరించి ఈ నివేదికను రూపొందించినట్లు యూఎన్‌ఓడీసీ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ యూరి ఫెదదోవ్‌తెలిపారు. ఉద్యోగాలు, మంచి జీతాలు ఇప్పిస్తామనే మాయమాటలకు కొంతమంది అమాయకు లు బుట్టలో పడుతుండగా, పిల్లల్లో ఎక్కువమంది కిడ్నాప్‌లకు గురవుతున్నారని ఆయన తెలిపారు. మానవుల అక్రమ రవాణాను అరికట్టేందుకు 2003 నాటికి ప్రపంచంలోని 18 శాతం దేశాల్లో కఠినచట్టాలు అమల్లో ఉండగా, నేడు 88 శాతం దేశాల్లో కఠినచట్టాలు ఉన్నాయని ఆయన చెప్పారు. అయితే ఈ చట్టాల కింద శిక్షలు మాత్రం తక్కువే పడుతున్నాయని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. ప్రపంచవ్యాప్తంగా 2030 సంవత్సరం నాటికి మానవ అక్రమ రవాణాను గణనీయంగా అరికట్టాలనే లక్ష్యాలను సాధించాలంటే ఇలాంటి కేసుల్లో దర్యాప్తును వేగవంతం చేసి దోషులకు కఠిన శిక్షలు విధించాలని ఆయన ప్రపంచ దేశాలకు పిలుపునిచ్చారు.

### మన దేశంలోనూ అక్రమ రావాణా..

మానవ అక్రమ రవాణా మన దేశం లోని అన్నీ రాష్ట్రాలకు విస్తరించింది. గత దశాబ్ద చరిత్ర పరిశీలిస్తే తమిళనాడు తొలి స్థానములో 9071 కేసులతో ముందుండగా, అంధ్ర ప్రదేశ్ 5801, కర్ణాటక 5443, పశ్చిమ బంగ 4190, మహారాష్ట్ర 3628 అధికారిక కేసులతో తరవాత స్థానాలు ఆక్రమించాయి. అనధికారికంగా ఈ సంఖ్యలు ఇంకా పది రెట్లకు మించి ఉండవచ్చు. అలాగే నగరాల్లో మన రాజధాని డిల్లీ ప్రథమ స్థానం, కొల్కతా ఇంచు మించు అదే స్థాయిలో రెండవ స్థానంలో ఉంది. ఉన్న సమా చారాన్ని బట్టి ఈ ఐదు రాష్ట్రాలు ఆ రెండు నగరాలు ఈ విషయం లో ఈ అక్రమ మానవ రవాణాకు ముఖ్యంగా మహిళల బాలికల రవాణాకు అడ్డాలుగా, గమ్యస్థానాలుగా వనరులు సమృాఎద్ధి తో విరాజిల్లుతున్నాయి. అంటే ప్రభుత్వ, పోలీసు, అధికారులు, ఈ వ్యాపారులు, రాజకీయ, ఆర్థిక, రవాణా, ఇన్–ఫ్రా సహకారం బాగా ఈ మానవ అక్రమ రవాణాకు సానుకూలంగా ఉన్నట్లు భావించాలి. అయితే ఈ కేసులు అధికారికంగా రిజిస్టర్ అయినదాన్ని బట్టి చూస్తే తమిళనాడులో తగ్గుముఖం పడుతూ ఉండగా పశ్చిమ బంగ్లా, ఆంధ్రప్రదేశ్ లో విస్తృతమౌతున్నట్లు కనిపిస్తుంది. యువతుల రవాణా – ఇతర్రతా పరిశీలిస్తే బహుళజాతి సరపరా దారుల ద్వారా ముంబాయి, డిల్లీ రెడ్–లైట్పరిసరాల్లో సరపరా చేయబడిన తమిళ యువతు లే పోలీస్ రైడ్స్ లో ఎక్కువగా పట్టుబడ్డారని యుఎన్ నివేదిక చెవుతుంది. రవాణా ఎక్కువగా జరుతున్న మొదటి పది దేశాలలో భారత దేశం ఒకటిగా ఉండటం మన దుంద్రుష్టకరం. పాకిస్తాన్, బంగ్లాదేశ్లలో తక్కువగా ఉండటానికి అక్కడ అమలయ్యే కఠిన చట్టాలే కారణం. ప్రతి ఎనిమిది నిమిషాలకు ఒక పిల్ల లేదా పిల్లవాడు ఇండియాలో మాయం అవుతున్నారు. బీహార్, జార్ఖండ్,తమిళనాడు, పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్ లలో వేలకొద్ది మిస్సింగ్ కేసులు నమోదవుతున్నాయి. ఈశాన్య రాష్ట్రాలలో రవాణా కేంద్ర బిందువు డిల్లి. మన చట్టాలు ఎంత చట్టుబండలుగా ఉన్నాయో తెలుస్తుంది. ప్రజలు ఉపాధి లేక పట్టణాలకు వలస పోతున్నారు. వాళ్ళ చుట్టూ రవాణా మాఫియా వేళ్లానుకుంటుంది. పేదరికంలో అల్లాడిపోతున్న ఆడపిల్లలు ఈ రవాణాలో కనీస సౌకర్యాలు, తిండి, నివాస సదుపాయాలు, వైద్యం ఏమీ దొరక్క లైంగిక రోగాలే కాకుండా, మానసిక రోగాల బారినపడి పిచ్చివాళ్ళయి చచ్చిపోతున్నారు.

ఏ నిరోధక చర్యలు పనిచేయకుంటే, కొన్నాళ్ళలో ఈ మానవ అక్రమ రవాణాలో మనదేశం ఒకటో స్థానంలో నిలబడటం ఖాయం.ఇప్పటికైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కళ్ళు తెరిచి కనీస

> ప్రపంచవ్యాప్తంగా కొనసాగుతున్న మానవ అక్రమ రవాణాకు సంబంధించి ఐక్యరాజ్యసమితికి చెందిన మాదక ద్రవ్యాలు, నేరాల నిరోధక కార్యాలయం విడుదల చేసిన ఓ నివేదికలో భయంకరమైన విషయాలు వెలుగుచూశాయి. వ్యభిచారం కోసం, నీలి చిత్రాల నిర్మాణం కోసం, వెట్టిచాకిరి కోసమే కాకుండా గనుల మైనింగ్ కార్యకలాపాల్లో బానిసల్లా పనిచేసేందుకు, ప్రైవేటుసైన్యంలో, టెర్రరిస్టుల తరఫున పోరాడేందుకు మానవులను అక్రమంగా రవాణా చేస్తున్నారు. మాఫియా ముఠాల తరఫున బిచ్చగాళ్లుగా మారేందుకు కూడా మనుషలను అక్రమంగా రవాణా చేస్తున్నారంటే వళ్లు జలదరిస్తుంది.

మానవత్వంతో రవాణాలో అమ్ముడుపోతున్న, హీనమైన జీవితాలతో అల్లాడిపోతున్న, పురుగుల్లాగా బతుకుతున్న ఈ మానవుల పట్ల ఏవైనా చర్యలు తీసుకుంటే బావుండు. ఈ అనైతిక వ్యాపార ఉధృతిని ఎదుర్కోవటానికి యుఎన్ 2013 ఈ చట్టాలకు పదును పెట్టే క్రమంలో తొలిదశలో మూడేళ్ళ కఠిన కారాగ శిక్ష నుండి జీవిత ఖైదు అమలు చేయమని వివిధదేశాలకు నిబంధనలు విధించారు. ఈ నిబంధనలు అక్రమంగా బాలబాలికలను తరలించటం లైంగికదోపిడి, భౌతికదోపిడి అంటే బానిసత్వం, దాస్యం , బలవంతంగా బిక్షాటనకు దేహాంగాలను తొలగించటం, వారి దేహాంగాల అమ్మకం లాంటి దుఃశ్చర్యలకు వర్తిస్థాయి. ఈ వ్యాపారం భారత్ లో మాత్రమే వర్ధిల్లుతుందని అనుకోవటం నిజంకాదు ప్రపంచవ్యాప్తంగా దినదిన ప్రవర్ధమానమౌతుంది.



# అలనాటి తారలు



పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు లో 1912 లో జన్మించిన కన్నాంబ ఆనాటి నావెల్ నాటక సమాజంలో పదమూడు సంవత్సరాల వయస్సులో బాల పాత్రలు వేస్తూ తొలిసారిగా నాటక రంగ ప్రవేశం చేసింది. తన నాటకరంగానుభవంతో 1935లో హరిశ్చంద్ర తెలుగు చలన చిత్రంలో ' చంద్రమతిగా అడుగు పెట్టింది. ఆ తర్వాత ద్రౌపదీ వస్త్రాపహరణంలో ద్రౌపదిగా అధ్భుతంగా నటించి తెలుగు ప్రేక్షకుల మన్ననలను, ప్రశంసలను అందుకుంది. ద్రౌపదీ వస్త్రాపహరణం, హరిశ్చంద్ర, పాదుక, చంద్రిక, కనకతార, పల్నాటి యుద్ధం, గృహలక్ష్మి , అనార్కలి, దక్షయజ్ఞం , తోడికోడళ్ళు, కృష్ణ కుచేల, తదితర చిత్రాలు ఆమె నటించిన ముఖ్యమైనవి.

ఎం.జి.రామచంద్రన్, ఎన్.ఎస్.రాజేంద్రన్, శివాజీగణేశన్, నాగయ్య, పి.యు. చిన్నప్ప, నందమూరి తారక రామారావు, తదితర అగ్రశ్రేణి నాయకుల సరసన ఎన్నో చిత్రల్లో ఆమె నటించింది.

సుమారు 150 పౌరాణిక, జానపద, చారిత్రక చిత్రాలలో తనదైన శైలిలో అద్వితీయంగా నటించి గొప్ప నటీమణిగా కీర్తి గడించింది. నవరసాలను సమర్ధవంతంగా అవలీలగా పోషించగల అద్భుత నటీమణి కన్నాంబ. కన్నాంబ భర్త కడారు నాగభూషణం, ఇద్దరూ కలసి ' రాజరాజేశ్వరీ ' చిత్ర నిర్మాణ సంస్థను స్థాపించి అనేక చిత్రాలు తెలుగులోను, తమిళ, కన్నడ భాషలలోను నిర్మించారు.

కన్నాంబ పాడిన కృష్ణం- భజరాధా' గ్రాంఫోన్ గీతాలు- ఆనాటి రోజుల్లో ప్రతియింటా మారుమ్రోగుతుండేవి. ఆమె గొప్ప నటిమణి మాత్రమే కాదు- చక్కని గాయని కూడా. సుమారు ఐదు దశాబ్దాలు తెలుగు చలన చిత్ర సీమలో తనదైన ప్రత్యేకత ప్రదర్శించిన శ్రీమతి కన్నాంబ 1964 లో మే 7 వ తేదీన తుదిశ్వాస వదిలింది.

నేనే రాణీనైతే, ఏలనె ఈ ధర ఏకఛాటిగా..... అని ఒక పాట. చేతిలో కత్తి పట్టుకుని, వీరావేశంతో గుర్రం మీద కూచుని ఠీవిగా, ధాటిగా కళ్లెర్రజేస్తూ పాడిన ఆ మహానటి పసుపులేటి కన్నాంబ. ఆ సినిమా పేరు చండి. ఆమె ఠీవి గురించి ఆ రోజుల్లో ఆ సినిమా చూసినవాళ్లు చెప్పుకునేవారు. అందులో కన్నాంబ ఇంకా కొన్ని పాటలు పాడారు. మరొక పాట ... ఏమే ఓ కోకిలా - ఏమో పాడెదవు, ఎవరే నేర్పినది ఈ ఆట ఈ పాట..... ఈ పాటలో ఆమె నవ్వులు రువ్వుతూ పాడతారు. మధ్యమధ్యలో వచ్చే ఆ నవ్వు - ఆమె తప్ప ఇంకెవరు అలా నవ్వులు కలువుతూ పాడలేరని కూడా ఆనాటి జనం చెప్పుకునేవారు.

కడారు నాగభూషణం గారిని వివాహం చేసుకుని శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ స్థాపించి తెలుగు తమిళభాషల్లో 22 చిత్రాలు నిర్మింపజేశారామె. సుమతి, పాదుకాపట్టాభిషేకం, సౌదామిని, పేదరైతు, లక్ష్మి, సతీ సక్కుబాయి, శ్రీకృష్ణతులాభారం, నాగపంచమి మొదలైన చిత్రాలు ఆ కంపెనీ నిర్మించింది. జీతాలు ఇవ్వడంలో ఆ కంపెనీకి గొప్ప పేరుండేది. ప్రతి నెలా ఒకటో తేదీ రాకుముందే, ముందు నెల చివరి రోజునే స్టాఫ్‌కి జీతాలు ఇచ్చేసేది ఆ కంపెనీ! వారి ఆఫీసు కూడా విశాలమైన కాంపౌండులో, కార్లు, వాన్‌లతో కలకల్లాడుతూ ఉండేది. ఎక్కువగా క్యారెక్టర్స్ ధరించినా, కన్నాంబకు హీరోయిన్ గ్లామరే వుండేది. ఇప్పుడు టైటానిక్ చీరలు అంటూ సినిమా పేర్లతో చీరలు వస్తున్నట్టు - అప్పుడు కాంచనమాల గాజులు - కన్నాంబ లోలాకులు అంటూ ఆభరణాలు వచ్చేవి. కన్నాంబ గొప్ప ఐశ్వర్యవంతురాలు అనీ, బంగారు కాసులు డబ్బాల్లో పోసి, పప్పులు, ఉప్పులు పెట్టుకునే డబ్బాల మధ్య ఎవరికీ తెలియకుండా ఉంచేవారనీ చెప్పుకునేవారు.

ఐశ్వర్యం ఎలా వస్తుందో ఎలా పోతుందో ఎవరూ చెప్పలేరని పెద్దలు చెబుతారు. ఎలా పోయాయో, ఏమైపోయాయో గాని కన్నాంబ మరణంతో కంపెనీతో సహా అన్నీ పోయాయి. ఆమె భర్త నాగభూషణం ఒక చిన్నగదిలో ఉంటూ కాలక్షేపం చేసేవారు. ఒకసారి ఒక మిత్రుడు ఆయన్ని కలవాలని ఆ గదికి వెళ్లి గుండె కలుక్కుమందట. ఆ చిన్నగదిలో ఒక ట్రంకు పెట్టె, ఓ కుర్చీ మాత్రం ఉన్నాయట. ఎదురుగా కన్నాంబ ఫోటో, దండెం మీద తువ్వాలు తప్ప ఇంకేం ఉండేవి కాదట. మరి అంత సంపద ఏమైందో దేవునికే తెలియాలి. ఇక కన్నాంబ ,మృతదేహాన్ని వారి కులాచారం ప్రకారం నగలతోనే పూడ్చిపెడితే దొంగలు ఆ నగలను కాజేసి ఆమె శవాన్ని కూడా మాయం చేశారట.

వారు గొప్ప నటులు, సినీ రంగానికి ఎంతో సేవ చేసిన వారు... ఎన్నో ఏళ్ళు పరిశ్రమలో శ్రమించిన వారు.. ఎంతో మంది అభిమానులను సంపాదించుకున్న వారు... ఎందుకో తెలియదు... కారణాలు రకరకాలు. తెలియకుండానే తెరమరుగు అయిపోయారు... కనిపించకుండా కనుమరుగు అయిపోయారు...ఇలా మయమైపోయిన వాళ్లు చాలా మంది ఉన్నా, ఇప్పుడు ఈ ఎపిసోడ్ లో కొంత మందిని మనం గుర్తు చేసుకుందాం... అలనాటి అందాల తారలు... వయసు పెరిగినా కూడా గ్లామర్ తగ్గని హీరోయిన్స్... తరువాత తరువాత క్యారక్టర్ ఆర్టిస్టులుగా మారి ఎన్నో పాత్రలు చేసిన వారు... చేయగలిగే ఓపిక ఉన్నా... అవకాశాలు వెతుక్కుంటూ వచ్చినా సరే ఇంట్రస్ట్ ఉన్నా సరే చేయకుండా మానేసిన వారు ఎంతో మంది.. ఉన్నారు.. కుటుంభానికి అంకితమై కనీసం కనిపించ కుండా మరుగున పడిపోయారు. తెలుగు ఇండస్ట్రీలో చామన ఛాయలో ఉన్నా కాని నేచ్యూరల్ గ్లామర్ ఉన్న హీరోయిన్ వాణి శ్రీ... ఆమె అంత అందంగా ఉంటుందని వాణి శ్రీకి మెకప్ వేయకుండా సినిమా తీశారు బాపు రమణలు.. ఎన్నో సినిమాలు మరెన్నో పాత్రలు హీరోయిన్ గా ఎలాంటి షేడ్ ఉన్న అన్ని రకాల హావభావాలు పలికించేది వాణిశ్రీ.. గంగ మంగ లాంటి సినిమాలో డ్యూయల్ రోల్ చేసి, అటు అమాయకురాలిగా... ఇటు గడుసు పిల్లగా తన నట విశ్వరూపంచూపించారు వాణిశ్రీ... ఆ తరువాత క్యారక్టర్ ఆర్టిస్టుగా బిజీ అయిన వాణిశ్రీ... తల్లి పాత్రలను అద్భుతంగా పండించారు.. భద్రాద్రి రాముడు సినిమాలో హీరోయిన్ తల్లిగా నటించిన కళాభినేత్రి ఆతరువాత సినిమాలు చేయలేదు.. తెలుగు ఇండస్ట్రీమీద కోపంగా ఉన్నారు అని టాలీవుడ్ లో గుసగుసలు వినిపిస్తున్నా... ఆరోగ్యం సహకరించకపోవడం, ఇండస్ట్రీమీద కోపంగా ఉండటంతో బయట కనిపించడంలేదు అని టాక్...





తనకి తాను యజమాని కాలేని మనిషి ఎన్నటికీ స్వతంత్రుడు కాలేడు - ఎపిక్టిటస్

చందమామ కథ

# అమ్మ ప్రేమ



అనగనగా ఒక ఊళ్లో ఒక తల్లి, కూతురు నివసించేవాళ్లు. తల్లి పేరు లక్ష్మమ్మ. కూతురు శాంతి. వాళ్లకు ఏ ఆస్తిపాస్తులూ లేవు. శాంతి చిన్నతనంలోనే వాళ్ల నాన్న వాళ్ళను వదిలేసి ఎక్కడికో వెళ్ళిపోయాడు. భర్త లేడని లక్ష్మమ్మ ధైర్యం కోల్పోలేదు. ఎందరు ఎన్ని రకాలుగా అవమానించినా సరే, తను మాత్రం ఉన్నంతలో చక్కగా బ్రతుక్కోవాలని సంకల్పించుకున్నది. క్రమం తప్పకుండా కూలికి పోయేది. ఒళ్ళు వంచి పని చేసేది. 'లక్ష్మమ్మ వస్తే చూసుకోనక్కర్లేదు' అనుకునేవాళ్లు రైతులు. తనకు వచ్చిన కూలిని రెండు భాగాలు చేసేది లక్ష్మమ్మ. ఒక భాగం కుటుంబం గడపడానికి. మరొక భాగం శాంతి భవిష్యత్తుకు.

లక్ష్మమ్మకు కూతురంటే ప్రాణం. శాంతికి కూడా అమ్మ అంటే చాలా ఇష్టం. ఒక రోజున తల్లీకూతుళ్లు ఇద్దరూ పొలం గట్టుమీద నడుస్తున్నారు. ఒకచోట గెనం సన్నగా ఉండింది. కూతురికి తను కింద పడుతానేమోనని భయం వేసి, అమ్మ చేతిని గట్టిగా పట్టుకుంది. లక్ష్మమ్మ ఆ చేతిని వదిలించుకొని, తనే శాంతి చేతిని పట్టుకుంది.

శాంతి ఈ సంగతిని గుర్తించి, గెనం దిగగానే అడిగింది– అమ్మా నువ్వు నా చేయి పట్టుకున్నా, నేను నీ చేయి పట్టుకున్నా ఒకటే కదా? అని. లక్ష్మమ్మ నవ్వి, జవాబిచ్చింది పాపా! మనూళ్ళో జనాల్ని అందరినీ బాగా గమనించు– పిల్లలు పెద్దయ్యాక తల్లిదండ్రుల చేతులు వదిలిపెట్టచ్చు; వాళ్ళని పట్టించుకోకపోవచ్చు గానీ, ఆ తల్లులు మాత్రం పిల్లల చేతులు వదలరు– వాళ్ళకు సాయం చేస్తూనే ఉంటారు అని. నేను మాత్రం నీకు సాయం చేస్తూనే ఉంటానమ్మా అన్నది శాంతి. ఆ పాపకు అర్థమైంది, తల్లికి తనంటే ఎంత ప్రేమో.

ఇట్లా తల్లినుండి జీవితానికి సంబంధించిన విలువల్ని అనేకం నేర్చుకున్నది శాంతి. ఆ క్రమంలోనే ఆ పాపకు తల్లి తనకోసం ఎంత కష్టపడుతున్నదో అర్థమైంది– శాంతికి పదేళ్ళు వచ్చేసరికి, ఆ పాప ఇక బడికి వెళ్లటం మానేసింది. లక్ష్మమ్మ శాంతికి అనేక రకాలుగా చెప్పి చూసింది– బడికి వెళ్ళటం ఎంత అవసరమో. అయినా శాంతి వినలేదు. తల్లితోబాటు కూలికి పోవటం మొదలు పెట్టింది. తన వంతుగా వచ్చిన కూలిని వేరుగా పెట్టుకోసాగింది కూడాను!

రాను రాను లక్ష్మమ్మకు శాంతి భవిష్యత్తు పట్ల బెంగ పట్టుకున్నది. తన జీవితం కూలితో సాగిపోతుంది– కానీ తన బిడ్డ?! శాంతి జీవితం బాగుండాలి. సొంత పొలం ఉంటే కొంత నయం. అయితే ఆ సరికి ఆమె కూడబెట్టిన డబ్బు చాలానే అయ్యింది– దానితో ఊరికి దగ్గరగా రెండెకరాల పొలం కొని, సొంత పొలం సాగు చెయ్యటం మొదలుపెట్టింది లక్ష్మమ్మ. ఇప్పుడు శాంతి తల్లితోబాటు తమ పొలంలోనే పనిచేయసాగింది. లక్ష్మమ్మ తెలివిగా తోటలో కొన్ని కాయగూరలూ, ఆకుకూరలూ, పూల మొక్కలూ, పండ్ల చెట్లూ– ఇట్లా రకరకాల పంటలు సాగు చేసేది. ఆ ఉత్పత్తులను తీసుకెళ్ళి వారం వారం జరిగే సంతలో అమ్ముకొచ్చేది శాంతి. అలా వచ్చిన డబ్బుల్ని తల్లికీ–తనకూ సమానంగా పంచి ఇచ్చేది. లక్ష్మమ్మ తన వాటాలో సగాన్ని ఇంటి ఖర్చులకోసం వాడి, మిగిలిన సగాన్ని శాంతికోసం అదనంగా దాచేది!

ఇట్లా పదేళ్ళు గడిచేసరికి లక్ష్మమ్మ కుటుంబం కొద్దిగా స్థిరపడింది. లక్ష్మమ్మ శాంతికి తన ప్రేమను అందివ్వటంతో పాటు ఎన్నో విలువలను నేర్పింది. అందరితో కలసిమెలసి ఎలా మెలగాలో, అందరికీ ప్రేమను ఎలా పంచాలో నేర్పింది. శాంతికి ఇప్పుడు ఇరవయ్యేళ్ళు వచ్చాయి. పొలంలో పని చేసి, చేసి ఆమె శరీరం బాగా గట్టి పడ్డది. ఇప్పుడు లక్ష్మమ్మకు, ఆమెకు కూడా విశ్రాంతిగా ఉండేందుకు కొద్దిగా సమయం చిక్కుతున్నది.

ఒక రోజున వాళ్ళింటి దగ్గర్లో ఆడుకుంటున్న పిల్లలు కొందరు శాంతిని ఎగతాళి చేశారు. నువ్వు మాలాగా బడికి వెళ్లలేవు; చదువుకోలేవు. నీకు ఏమీ రాదు, నువ్వు ఏమీ రాయలేవు, చదవలేవు. మేము చూడు ఎంతబాగా చదువుతామో! అంటూ నవ్వుకున్నారు. అది విని శాంతి చాలా నొచ్చుకున్నది. అక్కడే ఉండి అంతా గమనించిన లక్ష్మమ్మ బాధపడకు శాంతీ, నీకు చదువు పెద్దగా లేకపోయినా ఎన్నో విలువలు తెలుసు; మంచి-చెడు తెలుసు. ఏదో ఒక రోజున నువ్వు కూడా చదువుకుంటావు–



నాకు తెలుసు. నువ్వు గొప్పదానివి అవుతావు శాంతీ! అయినా సమయం అస్సలు మించి పోలేదు. ఇప్పుడైనా చదవటం మొదలు పెట్టు అని చెప్పింది.

శాంతికి తల్లి మాటలు గొప్ప ప్రేరణనిచ్చాయి. ఊళ్ళో రంగనాథం మాస్టారు మంచి మనిషి అని అందరూ చెప్పుకుంటారు. శాంతి వెళ్ళి ఆయన్ని సాయం చెయ్యమని అడిగింది. దానిదేముందమ్మా, మొదట నువ్వు పదోతరగతి పరీక్షలు రాయాలి. తర్వాత ఓపెన్ యూనివర్సిటీ ద్వారా డిగ్రీ పరీక్షలు రాయొచ్చు. నువ్వు కృషి చెయ్యి– నేను నీకు సాయం చేస్తాను అన్నారాయన. శాంతి ఆరోజునే చదువు మొదలు పెట్టింది. సంవత్సరం తిరిగేసరికి పదోతరగతి పరీక్షలు రాసింది. యాభైశాతం మార్కులతో పాసైంది! వెంటనే సార్వత్రిక విశ్వవిద్యాలయం ద్వారా డిగ్రీకి కట్టుకున్నది. రామనాథం మాస్టారి సాయంతో చాలా శ్రమించి చదివింది. మొదటి తరగతిలో ఉత్తీర్ణురాలైంది! ఆ వెంటనే జరిగిన రాష్ట్రస్థాయి పరీక్షల్లో పదో ర్యాంకు సంపాదించుకొని, ఆమె గ్రూప్ 2 ప్రభుత్వ ఆఫీసరుగా ఎంపికైంది. పేపర్లవాళ్ళు ఆమెను ప్రత్యేకంగా అభినందించారు. కఠిన పరిస్థితులు ఎన్ని ఉన్నా పోరాడి గెల్చిన మహిళ అని ప్రశంసించారు. నాదేం లేదు– ఇదంతా మా అమ్మ గొప్పతనం అన్నది యంఆర్వో శాంతి.

# గాడిదకు స్మారక చిహ్నం

అమర వీరులకు, చారిత్రక ఘటనలకు స్మారక చిహ్నాలు నిర్మించడం చూశాం. గత జ్ఞాపకాలకు గుర్తుగా వాటిని దర్శించుకోవడం చూశాం. కాని జంతువులకు అదీ గాడిదకు స్మారక చిహ్నం ఎక్కడైనా చూశారా? పోని విన్నారా? కాని ఇది నిజం. గాడిదకు ఓ స్మారక చిహ్నం ఉంది. ఏంటి నమ్మశక్యంగా లేదా? కాని ఇది అక్షర సత్యం. డౌటుంటే చైనా వెళ్లాల్సి వదండి..

ఓరేయ్ గాడిద కొడకా.. గాడిదలా ఎదిగాడు.. ఏపని చేతగాదంటూ ..అంటూ తిడతాం...గాడిద అంటే అంత చులకన. కాని చైనాలోని ఛాంగ్‌చూ జూ అధికారులు మాత్రం గాడిదకు స్మారక చిహ్నం కట్టించారు. ఇంతకు ఆ గాడిద చేసిన ఘనకార్యం ఏంటనేకదా మీ ఆలోచన. గాడిద చేయలేదు. జూ అధికారు చేసిన ఘోరమైన తప్పుకు ప్రయశ్చిత్తంగా గాడిదకు స్మారక చిహ్నం నిర్మించారు. వివరాలాలోకి వెలితే..



అది జూన్, 2017. చైనాలోని ఛాంగ్‌చూ సిటీలోని చైనాలోని యాంచెంగ్ సఫారీ పార్క్ పార్క్.. అసలు వీళ్లు మనుషులేనా అనేంత ఘోర తప్పిందం చేశారు ఆ జూ అధికారులు. సందర్శకులు చూస్తుండగానే బతికున్న గాడిదను రెండు పులలకు ఆహారంగా వేశారు. వివరాల్లోకి వెళితే..

ఆరోజు ఒక వాహనంలో గాడిదను పులులున్న కంచెకు దగ్గరగా తీసుకొచ్చిన అధికారులు, దాన్ని నీటిలోకి బలవంతంగా తోసేశారు. ఒక టైగర్ నీటిలోకి దూకి.. గాడిద తలను గట్టిగా పట్టుకోగా, దాని నుంచి తప్పించుకోవడానికి గాడిద చేసిన ప్రయత్నాలు అన్నీ ఇన్నీ కావు. ఏం చేసినా చివరకు ఫలితం లేకపోయింది. చివరికి గట్టుపైనున్న మరో పులి కూడా నీటిలోకి దూకేసింది. రెండు పులులు కలిసి గాడిదను చంపి తినేశాయి. ఈ దారుణ ఘటనను ప్రత్యక్షంగా చూసిన సందర్శకులు షాక్‌కు గురయ్యారు.అధికారుల తీరుపు ఆగ్రహం వ్యక్తం చేశారు.



జంతు ప్రేమికులు అధికారుల తీరుపై నిప్పులు చెరిగారు. పులులకు బతికివున్న గాడిదను ఆహారంగా పెట్టడం సంచలనంగా మారింది. జూ అధికారులు చేసిన పనికి ఓ రేంజ్‌లో నెటిజన్స్ మండిపడ్డారు.గాడిదను పులులకు బలిచ్చిన వీడియో సోషల్ మీడియాలో వైరల్ గా మారింది. జాలి లేకుండా హీనంగా ప్రవర్తించారని దుమ్మెత్తి పోశారు నెటిజన్లు. దేశవ్యాప్తంగా జూ సిబ్బందిపై విమర్శలు వెల్లువెత్తాయి. దీంతో గాడిదను పులులకు ఎరగా వేయడం తప్పేనేని, ఇలాంటి సంఘటనలు పునరావృతం కాకుండా చూసుకుంటామని అధికారులు తప్పును అంగీకరించారు.

అయితే జూ అధికారులు తాము చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం అనుకన్నారో, విమర్శకులును శాంతింప చేయాలనుకున్నారో తెలీదు కాని, ఇప్పుడా గాడిదకు జూ సిబ్బంది ఓ స్మారక చిహ్నాన్ని నిర్మించారు. దీంతో అప్పుడు బతికున్న గాడిదను పులులకు ఆహారంగా వేయడం ఎంతగా వైరల్ అయిందో ఇప్పుడు గాడిదకు స్మారక చిహ్నం నిర్మించడం అంతే వైరల్ గా మారింది. సో..అదిండి సంగతి. మొత్తానికి ప్రపంచంలో గాడిదకు స్మారక చిహ్నం ఏర్పాటు చేయడం మాత్రం ఇదే మొదటిసారి.

ఈ ప్రపంచం కఠినాతి కఠినమైంది. ఈ వాస్తవాన్ని ఎదుర్కోవడంలోనే సంతోష రహస్యం ఇమిడి వుంది. -బెర్ట్రండ్ రస్సెల్

# సూర్య బుడత



## దారిని చూపండి




**Draw a path to help the bear find its way back to its mate.**

## రంగులు వేయండి



## చుక్కలు కలపండి



పిల్లలూ ఈ గుర్రానికి దాని పిల్లకు మంచి రంగును చూసి వేయండి

```
C V E E L D H M T E S F T R A Y L K S A E T J Y A R Q B M G
L F P O T D I A M O N D D C R T W U D K P E T I L B B M X Q
A Q A S V N S W D P C Q I U K J A F O V A P E T W M M X H C
Y B U Z G Y D H O A N B F N V T H L Z G K A P E H X X I S O
J R S K Z J N S Z L Y L O M O E S Q C R V K A Y H I I S E P
C M A V T U Y D K V U L Z X G S C B J B G V K G A S S D R P
U W N F R E J N E S J W K I R P A L U M R G V O R D D O O E
E H D Q A P U Y T G U H U T C A N U F X B R G L D O O Z C R
P S S B U A E J A R E S F D M K Y W R I M B R O N Z Z J D B
A D T L Q L P U L C P C Q O X V J H E S X M B E E J J U O M
L N O A R V A E S M A N B Z I G T S R S I X L G S U U F Z X
V Y N R C G L L U X L Y L K T R E C O D S I M P S F F Q J H
G S E E M R V A F I V J W U D B P N S O S I X A S Q Q A U S
R E L N X C G H Q T G T H F O M A Y I S D S I K C A A L F D
C D V I I M R S N A I D I S B O E J O Z O D S V A L L W Q O
N I C M T X C E B D R E S Q Z D K F N J Z O D G L W W H A Y
X M G I D I M P L O C P C B N X V T Q U J Z O R E I H R L J
I E R M H T X A W Z M A N E K I G E B F U J Z B G H R C W U
T N E H O P I L H K X L L L U T R P L Q F U J N R R C N H F
E T T W A D R V S U I B Y W F D B A W A Q F E M C C N Y R Q
O A I H Z L T O D F N V J H Q O M K H L A O U X N N Y I C A
Z R N S K O I G M R T G T S B Z X V S W U Q F I Y Y I T N L
C Y A D V Z D T O A D R E C L K I G C S L A Q S I I T E Y W
A J R N F K O H E Q T C P N W U S R R H W L A D T T E P I H
L T G Y Q U Z R N B O E A Y H F D O N S H W L O E E P Z T R
C N C J B F K C Y L Z A M J S Q C B Y C S H W Z P P Z K E C
I I M U M Q U M J W M M K T L K O M J N C R H J Z Z K V P N
T L X E W B F X U G K X V E C A Z X T Y N C R U K K V G Z Y
E F I P H M Q I A H U I G P N B V I E J Y N C F V V G Q K I
K U T A S W B M E N O T S E M I L A P T J Y N Q G G Q B V T
```

CALCITE
CRUST
FLINT
HALITE
IGNEOUS
ROCK
METAMORPHIC
SANDSTONE
SULFUR
CLAY
DIAMOND
FOSSIL
HARDNESS
SCALE
LAVA
MINERAL
SEDIMENTARY
TALC
COPPER
DINOSAURS
GEOLOGY
HORNBLENDE
LIMESTONE
OBSIDIAN
SHALE
CORE
EROSION
GRANITE
MAGMA
QUARTZ

SLATE
APE
MAN
SIX
TOAD
WAX

## తేడాలు గుర్తించండి



Name:_______________ Date:__________

eye
pony
yoyo
panda
arrow
parrot



| v | a | r | r | o | w |
|---|---|---|---|---|---|
| y | o | y | o | y | l |
| n | k | d | e | y | e |
| o | n | p | t | a | t |
| p | a | r | r | o | t |
| p | a | n | d | a | s |



జీవితం బరువు బాధ్యతలను ఆనందంతో వహించడం నేర్చుకోవాలి. -శ్రీమద్భాగవతం

వాత్స్యాయన

# శృంగారంలో పడక గదీ కీలకమే!

నవరసాలలో ఒక రసం శృంగారం. అందంగా కనిపించడానికి ఆరోగ్య రక్షణకు శరీరాన్ని శుభ్రపరచుకొని వివిధ వస్తువులతో అలంకరించుకోవడాన్ని శృంగారం అంటారు. తన భాగస్వామి కోసం బాగా ఆకర్షించే విధంగా తయారైన పురుషుడిని శృంగారపురుషుడని, బాగా ఆకర్షించే విధంగా తయారైన స్త్రీని శృంగారవతి అని అంటారు. శృంగారంతో ఎన్ని రకాల ప్రయోజనాలున్నాయి. మానసిక ఒత్తిడి తగ్గడం, ఒంట్లో కొవ్వు కరగడమే కాదు.. తెలివితేటలు కూడా పెరుగుతాయట! మెదడులో ఉండే హిప్పోక్యాంపస్ అనే ప్రాంతంలో కొత్త న్యూరాన్లు ఏర్పడేందుకు శృంగారం ఎంతగానో ఉపయోగపడుతుంది. హిప్పో క్యాంపస్ దీర్ఘకాల జ్ఞాపకశక్తికి ఉపయోగపడుతుందని పరిశోధకులు వెల్లడించారు. ఎలుకలపై దీనికి సంబంధించిన ప్రయోగాలు చేశారు. వీటికి కొత్తగా న్యూరాన్లు ఏర్పడుతున్నా, లైంగిక కార్యకలాపాలు లేకపోతే మాత్రం జ్ఞాపకశక్తి ఏమాత్రం పెరగలేదని మేరీలాండ్ విశ్వవిద్యాలయముకు చెందిన మానసిక వైద్యనిపుణులు వెల్లడించారు. శృంగారంలో పాల్గొనడం వల్ల మెదడు కణాల్లోకి ఆక్సిజన్ బాగా చేరుతుందని వాళ్లు గుర్తించారు. ఇంతటి ప్రాముఖ్యత ఉన్న దంపతుల మధ్య శృంగారానికి వేదిక పడక గది. కాని దానికి మనం అంతటి ప్రాధాన్యత ఇస్తున్నామా? అంటే లేదని చెప్పాలి. కాని శృంగారానికి పడక గది అలంకరణ కూడా కీలకమే అంటున్నారు వాత్యాయనుడు. అవేంటో తెలుసుకుందాం.

పతి ఒక్కరూ వాస్తు ప్రకారం ఇల్లు కట్టుకుంటారు మరి పడక గది ఎలా ఉండాలి ? ఎవరి స్థాయికి తగ్గట్టు వారి ఇల్లు ఉంటాయి ఉన్నంతలో నే పడక ను అందంగా



అలంకరించుకోవాలి ఇంటి లోపలికి భాగాన్ని ఆడవారు పడుకునే విధంగా ఏర్పాటు చేసుకోవాలి ఇక బయటి గదులలో అంటే ఇంటి ముందు భాగంలో పడక గది ఉండాలంటాడు వాత్సాయనుడు . ఆ గదిలో నగిషి చేయబడిన పెద్ద మంచం అంటే డబుల్ కాట్ మంచం అయితే అందరూ డబ్బు ఉన్న వాళ్ళు కాక పోవచ్చు వారి స్థాయికి తగ్గట్టు ఏర్పాటు చేసుకోవాలి . దాన్ని పైన మెత్తటి పరుపు లేదా ఏదైనా దుప్పటి దాని మీదా తెల్లని శుభ్రమైనది మరోక దుప్పటి ఇక్కడ తెలుపు ఎందుకు అన్నారంటే తెల్ల రంగు శాంతి కి చిహ్నం అంటే ఆ మంచం దగ్గరకు రాగానే శాంతంగా మరియు టెక్షన్ లేకుండా ఉండాలని . తల క్రిందకు మరియు కాళ్ళ వైపుకు చక్కని దిండ్లు ఉండాలి . పరువు పై వేసిన దుప్పటిని వీలైతే రోజు గానీ రెండు మూడు రోజుల కొకసారైన శుభ్రంగా ఉతికి ఇస్త్రీ చేయించి వేసుకోవాలి . రతి తర్వాత స్త్రీ పురుషుడు ఇద్దరు ఒకే మంచం పైన పడుకోకూడదు దీనికి సైన్స్ పరంగా ఆలోచిస్తే అర్థం ఉంది రెండు శరీరాలు కలిసోక బాగా అలసి పోయి ఉంటారు లోపలి అవయవాలు రిలాక్స్ అవ్వాలి కదా ఇలా ఆలోచిస్తే చాలా అర్థాలు ఉన్నాయి . అందుకని పెద్ద మంచం పక్కన దాని కంటే కాస్త తక్కువ ఎత్తు లో ఉండే మరో మంచాన్ని వేసుకోవాలి. మంచానికి తల వైపు భాగంలో నేల మీదా దైవ ప్రార్ధన చేసుకోవడానికి ఒక కుర్చీ లేదా చెక్క పీట లాంటిది కూర్చుని దేవున్ని ప్రార్ధించుకున్నాకే నిద్ర నిమిత్తం పడక మీదకు చేరాలి . పడక గదిలో ఏదైనా ఒక గోడకు ఆనుకొని మంచంతో సమానమైన ఎత్తు లో మూరేడు వెడల్పు గల అరుగు లేదా గచ్చు చేయబడింది ఉండాలి అంటే ఆ రోజుల్లో ఈ కుర్చీలు టి పాయ్ లు లేవు కాబట్టి వాత్సయన అలా చెప్పారు . దాని పైన ఒక ప్లేట్ లో సుగంధ ద్రవ్యాలు అంటే యాలకులు లవంగా చందనం పూలు పండ్లు ఇలా అన్నమాట ఇవి ఎందుకు అంటారా ఇవి కామ శక్తిని పెంచుతాయి తాంబులం అందరికీ తెలిసిందే ఇది చాలా మంది చిలకలు చుట్టి ఒకరికి ఒకరు తినిపించుకుంటారు ఈ తమలపాకు కూడ శృఎంగార శక్తిని పెంచుతుంది మొదలైన వస్తువులన్నీ ఈ అరుగు మీదా పెట్టుకోవాలి చెమట పోస్తే విసన కర్ర ఒకటి విసురు కోవడాని ఉంచుకోవాలి ఈ రోజుల్లో లాగ ఆ రోజుల్లో ఫ్యాన్లు కూలర్లు ఏ సి లు లేవు కదా అందుకు అలా చెప్పాడు

అలాగే పక్కన తిన్న తమలపాకు ను ఉమ్మి వేసుకోవానికి మంచం కింద ఏదైనా పెట్టుకోవాలి ఇంకా చదువుకో వడానికి పుస్తకాలు ఏదైనా ఆడుకోవడానికి ఆట వస్తువులు ఏర్పాటు చేసుకోవాలి తొందరగా వాడి పోని ఏవైన పోగడ పూల లాంటివి ఏర్పాటు చేసుకోవాలి తన ఆన్నుకుని సుఖంగా పడుకోవడానికి ఒక పడక కుర్చీని కూడ మంచం దగ్గరగా నేల మీద వేసి ఉంచుకోవాలి. ఇలా అన్ని ఏర్పాటు చేసుకొని రతి కార్యం నిదానంగా మొదలు పెట్టాలి సుగంధ ద్రవ్యాలు తినిపించుకుంటూ రతి చేయాలి ఇంకా వీలు అయితే స్త్రీ బదులుగా ఏవైనా మంచి సువాసన వచ్చే అగరువత్తులు వాడాలి అని అంటాడు వాత్సాయనుడు. ఇలా ఈ బుక్ లో నీ గూడ అర్ధాలు చాలా ఉన్నాయి అర్ధం చేసుకుంటే రతి లో వారికి తిరుగు లేదు.

---

క్రైం స్టోరీ

# మరణ శాసనం

మద్యం మహమ్మారి ఓ కుటుంబం పాలిట మరణ శాస నమైంది. మద్యానికి బానిసైన కుటుంబ పెద్ద లైంగిక వేధింపులు..కుటుంబ కలహాలు ఐదుగురు హత్యకు,మరో వ్యక్తి ఆత్మహత్యకు దారితీసింది. కోడల్ని కూతురుగా చూసుకోవాల్సిన వ్యక్తి, ఇంటి పెద్ద కోడలి పట్ల వ్యవహరిస్తున్న తీరుతో విరక్తి చెందిన కొడుకు కుటుంబం పాలిట కాలయముడయ్యాడు. తల్లిదండ్రులతో సహా, భార్యా, తన ఇద్దరు పిల్లలను కడతేర్చి ఓ తానూ ఆత్మహత్యకు పాల్పడ్డాడు. క్షుద్రపూజలని నమ్మించి..ఒకరి తర్వాత ఒకర్ని రప్పించి..కుటుంబాన్ని మొత్తం కడతేర్చి తాను కడతేరి పోయాడు. ఖమ్మం జిల్లాలో పెను విషాదం మిగిల్చిన దారుణ ఘటన వివరా ల్లోకి వెళితే... జిలాలోని కూసుమంచి మండలం పాలేరు జలాశయం మినీహైడల్ ప్రాజెక్టు వద్ద తెల్లవారు జామున చోటు చేసుకున్నది. స్థానికులు, పోలీసుల కథనం ప్రకారం.. కూసుమంచి మండలం జీళ్లచెరువు గ్రామానికి చెందిన షేక్ పెంటూ సాహెబ్, మహబూబీ దంపతులు. వీరి ఇద్దరి కుమారులు షేక్ సలీం, లాల్‌సాహెబ్ విత్తనాల కంపెనీల్లో పనిచేస్తున్నారు. పెద్ద కుమారుడు సలీంకు రజియాతో ఎనిమిదేండ్ల క్రితం వివాహం జరగ్గా వారికి సనాజ్, నస్రీన్ అనే ఇద్దరు కూతుర్లు ఉన్నారు. ఏడాదిన్నర నుంచి వీరి కుటుంబంలో గొడవలు మొదలయ్యాయి. కుటుంబ యజమాని పెంటూసాహెబ్ మద్యానికి బానిసయ్యాడు. తాగొచ్చి కుటుంబ సభ్యులతో పాటు ఊర్లో జనంతోనూ గొడవలకు దిగుతున్నాడు. కోడలి పట్ల లైంగిక వేదింపులకు పాల్పడుతున్నట్లు తెలిసింది.దీంతో తీరు మార్చుకోవాలని ఇద్దరు కొడుకులు పలుమార్లు మందలించారు. ఈ క్రమం లో రెండు నెలల క్రితం పెద్దకొడుకు దాడి చేయడంతో తండ్రి చేయి విరిగింది. అయినా అతని ప్రవర్తనలో మార్పు రాలేదు. అందరి చావుతోనే సమస్య పరిష్కారమవుతుందనే ఆలోచన కొచ్చిన సలీం ఓ పథకాన్ని రచించాడు. తమ్ముడిని వదిలేసి ఐదుగురిని చంపి తానూ చావాలని భావించాడు. తండ్రి మద్యం మానేయాలంటే క్షుద్ర పూజలు చేయాలని కుటుంబ సభ్యులకు సోమవారం చెప్పగా అంతా ఒప్పుకున్నారు. ఈ క్రమంలో సలీం అర్ధరాత్రి 12గంటల సమయంలో తన ద్విచక్ర వాహనంపై తండ్రి పెంటూ, తమ్ముడు లాల్‌సాహెబ్‌తో కలిసి పాలేరు మినీహైడల్ కాలువ వద్దకు చేరుకున్నారు. ఆ తరువాత తన వాహనాన్ని తమ్ముడికిచ్చి అమ్మ, వదిన, పిల్లలను తీసుకుని రావాలని పంపించాడు. ఈ సమయంలోనే సలీం.. తన తండ్రి పెంటూను కాలువలోకి నెట్టేశాడు. అరగంట తరువాత లాల్‌సాహెబ్ అమ్మ, వదిన, ఇద్దరు పిల్లలతో అక్కడికి వచ్చాడు. నాన్న ఎక్కడా అని తమ్ముడు ఆరా



తీయగా, బహిర్భూమికి వెళ్లాడని నమ్మించాడు. ఇంట్లోని టేబుల్‌పై సరుకులు, పూజారి రాసిచ్చిన కాగితం మరిచిపోయానని, వెంటనే తేవాలని తమ్ముడిని తిరిగి ఇంటికి పంపాడు. అతను ఇంటికి బయలు దేరగానే.. సలీం తన ప్లాన్ ప్రకారం తల్లి, భార్యను లుంగి, తాడుతో కట్టేశాడు. వారి పిల్లలను సైతం అలాగే కట్టాడు. క్షుద్రపూజల్లో భాగమని వారిని నమ్మించి కాలువలోకి తోసేశాడు. ఆ వెంటనే సలీం కూడా కాలువలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. ఇంటికి వెళ్లిన తమ్ముడు లాల్‌సాహెబ్.. అన్న రాసి ఉంచిన సూసైడ్ నోట్ చదివి కంగుతిన్నాడు. ఆ వెంటనే ఇద్దరు స్నేహితులతో కలిసి కాలువ వద్దకు చేరుకున్నాడు. అక్కడ ఎవరూ లేకపోవడంతో చుట్టుపక్కల వెతికారు. కాలువలో గాలించగా తెల్లవారుజాము 5.30 గంటలకు పెంటూ సాహెబ్, మహబూబీ, సలీం, రజియా, సనాజ్, నస్రీన్‌ల మృతదేహాలు బయటపడ్డాయి. ఖమ్మం సీపీ తఫ్సీర్ ఇక్బాల్, ఏసీపీ సురేశ్‌కుమార్ సంఘటన స్థలానికి చేరుకుని మృతదేహాలను పోస్టుమార్టం నిమిత్తం ఖమ్మం ప్రభుత్వ వైద్యశాలకు తరలించారు. సలీం రాసిన సూసైడ్ నోట్‌ను ఏసీపీ స్వాధీనం చేసుకున్నారు.ఈ ఘటన ఒక్కసా రిగా జిల్లాలో దావానలంలా వ్యాపించింది. ఒకే కుటుంబానికి చెందిన ఆరుగురు మృతి చెందిన విషయం తెలుసుకున్న రోడ్లు భవనాల శాఖ మంత్రి తుమ్మల నాగేశ్వరరావు, ఎమ్మెల్సీ బాలసాని లక్ష్మీనారాయణ, జెడ్పీ చైర్‌పర్సన్ గడిపల్లి కవిత, డీసీసీబీ చైర్మన్ మువ్వా విజయబాబు తదితరులు హుటాహుటిన జీళ్లచెరువుకు చేరుకుని ఘటనపై ఆరా తీశారు. మృతుల కుటుంబానికి ప్రగాఢ సంతాపం తెలిపారు. బాధిత కుటుంబాన్ని ప్రభుత్వం తరవున ఆదుకుంటామని హామీ ఇచ్చారు. కాని పోయిన ఆరు ప్రాణాలను తిరిగి తేగలమా?





కిరీటం అలంకరించుకొన్న శిరస్సు సుఖాలకు దూరం కావలసి వస్తుంది. -షేక్స్‌పియం

## జాతకం

# ముహూర్తాలు తారాబలం

ఏ కార్యానికైనా తారాబలం ముఖ్యం. జన్మ నక్షత్రం నుంచి ప్రారంభించి, ఆనాటి నక్షత్రం వరకు తొమ్మిది, తొమ్మిది చొప్పున లెక్కపెట్టగా మొదటిది జన్మతార, రెండవది సంపత్తార, మూడవది విపత్తార, నాల్గవది క్షేమతార, ఐద వది ప్రత్యక్తార, ఆరవది సాధనతార, ఏడవది నైధనతార, ఎనిమిదవది మిత్రతార, తొమ్మిద వది మిత్రతార అవుతాయి. ఉదాహరణకు అశ్వినీ నక్షత్రంలో పుట్టిన వారికి అశ్విని, మఖ, మూలలు జన్మతారలు అవుతాయి. తరువాతి నక్షత్రాలు సంపత్తారలవుతాయి. ఇలాగే తొమ్మిది వరకు చూడాలి. వీటిల్లో సంపత్, క్షేమ, సాధన, మిత్ర, పరమ మిత్ర తారలు శుభప్రదాలు. జన్మ, విపత్, ప్రత్యక్, నైధన తారలు, పనికి రానివి. అంటే తిథి వార నక్షత్రాదులు అన్నీ బాగున్నా తారాబలం కూడా కనుక లేకపోతే ఆ మూహర్తం వారికి పనికి రాదు.



జన్మనామం తెలియక జన్మనక్షత్రం గుర్తు లేకపోతే పేరులోని మొదటి అక్షరాన్ని బట్టి నామ నక్షత్రాన్ని తెలుసుకుని దాని నుంచి నిత్య నక్షత్రం దాకా లెక్కించి, తారాబలం గుర్తించే విధానం ఉంది.

జన్మతారలో ఏడు గడియలు,విపత్తారలో మూడు గడియలు, ప్రత్యక్, నైధన తారల యితే ఎనిమిది గడియలు విడిచి, ఆ పిదప శుభప్రదాలుగా ఎంచుకోవాల్సి ఉంటుంది. జన్మతారకు తోటకూర, విపత్తారకు బెల్లం, ప్రత్యక్తారకు ఉప్పు, నైధనతారకు నువ్వులతో పాటు బంగారాన్ని దానం చేస్తే తారా దోషం పోతుందని కొందరి పండితుల భావన.

**జాతకర్మ**

శిశువు జన్మించిన వెంటనే జాతకర్మ చేయాలి. అది కూడా నాభిచ్ఛేదానికి ముందే చేయాలట. నాభిచ్ఛేదం తర్వాత తండ్రికి జాతాశౌచం ప్రారంభమవుతుంది. కనుక అంతకు ముందే జాతకర్మ తండ్రి నిర్వ హించాలి. ఈ పద్ధతిలో తిథి, వార, నక్షత్రా లతో గాని, ముహూర్త బలంతో గాని సంబంధం లేదు. ఏ కారణం చేతనైన అప్పుడు జాతకర్మ కుదరక పోతే ఆ తరువాత చేయాల్సినప్పుడు మాత్రం తిథివార నక్షత్రాదు లను చూసి ముహూర్తం నిర్ణయించాల్సి ఉంటుంది.

శిశువు జన్మించిన వెంటనే కాని పురుడు తొలగిన తరువాత గాని జాతకర్మ చేయాలని ముహూర్త దర్పణం చెబుతోంది. ఈ విధంగా ప్రస్తుతం చేసేదే బారసాల. ముహూర్త చింతా మణి 11వ రోజుగాని, 12వ రోజుగాని జాత కర్మ చేయాలని పేర్కొంది. పర్వతిథులు, రిక్త తిథులు, జాతకర్మకు పనికి రావు. మృదు, ధ్రువ, క్షిప్ర, చర నక్షత్రాల్లో ఏవైనా జాతకర్మ చేయవచ్చు. చతుర్థి, నవమి, చతుర్దశి- ఇవి రిక్తతిథులు. ఏకాదశి, ద్వాదశి, పూర్ణిమ, అమావాస్యలు పర్వతిథులు. మృగశిర్ష, రేవతి, చిత్త, అనూరాధలు మృదు నక్షత్రాలు. ఉత్తరాత్రయం, రోహిణిలు ధ్రువ నక్షత్ర ములు. హస్త, అశ్విని, పుష్యమి అభిజిత్తు క్షిప్ర నక్షత్రాలు. స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ట, శతభిషలు చర నక్ష త్రాలు. మంగళ, శనివా రాలు జాతకర్మకు పనికిరా వని ధర్మ సింధువు చెబు తోంది.

అయితే బారసాలకు తిథులు, నక్షత్రాలు చూడడం ఆచారంగా లేదు. పైగా అది వైదిక సంస్కారం క్రియ కాదు. జాకకర్మాదు లను ప్రాయశ్చిత్తపూర్వ కంగా ఉపనయనానికి ఒక రోజు ముందుగా, ఒక్కో రోజు అదే రోజు కూడా చేయడం కూడా ఆచారంగా మారిపోయింది.

దేవర్షి పితృ రుణాలు మూడింటిలో పుత్ర జననం వల్ల పితృ రుణాలు విముక్తి కలుగుతుందని భారతీ యుల పవిత్ర భావన. జాతకర్మ, నామకరణం, డోలాహరణాలతో పాటు, బాలింతరాలి చేత మొట్టమొ దటగా బావిలో చేద వేయించి, నీరు తోడించే కార్యక్రమాన్ని కూడా కలిపి లౌకికాచారంగా 21వ రోజు నిర్వహించే సంప్రదాయం కొన్ని ప్రాంతాల్లో కనిపిస్తోంది. ఆ సమయంలో వర్జ్యం, దుర్ముహూర్తం లేకుండా మాత్రం చూస్తున్నారు.

అన్నప్రాశనం

మగ శిశువుకు ఆరవ మాసంలోనూ, ఆడ శిశువుకు ఐదవ మాసంలో అన్న ప్రాశన చేయాలని మూహూర్త చింతామణి పేర్కొంది. కాలామృతం పురుష శిశువుకు ఆరు, ఎని మిది మాసాల్లోను, స్త్రీ శిశువుకు ఐదు, ఏడు, తొమ్మిది, పదకొండు మాసాల్లోను అన్నప్రా శన చేయవచ్చని తెలుపుతోంది.

భరణి, కృత్తిక, ఆశ్లేష, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, జ్యేష్ఠ, మూలా నక్ష త్రాలు అన్నా ప్రాశనానికి పనికి రావని కాలా మృతం చెబుతోంది. అశ్విని, మృగశిర, పున ర్వసు, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాత్రయం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర నక్షత్రాలు శుభప్రదాలని ముహూర్త దర్పణం తెలిపింది. శిశువు జన్మించిన నక్షత్రం పనికి రాదని కొందరి పండితుల అభిప్రాయం.

## 30 -7-2017 నుండి 05-8-2017 రాశిఫలం



**మేషం: Aries** (అశ్వని4 పాదాలు, భరణి 4 పాదాలు, కృత్తిక 1వ పాదము): స్త్రీలకు ఆర్జనపట్ల ఆసక్తితో పాటు ఉద్యోగయత్నాలు ఫలిస్తాయి. వాహనం ఇతరులకిచ్చి ఇబ్బందులెదుర్కొంటారు. మీ నిజాయితీ, చిత్తశుద్ధి ప్రముఖులను ఆకట్టుకుంటాయి. వైద్య, ఇంజనీరింగ్, శాస్త్ర వాణిజ్య రంగాల్లో వారికి అనుకూలంగా ఉంటుంది. సోదరీ, సోదరుల మధ్య అవగాహన ఏర్పడుతుంది.



**వృషభం: Taurus** (కృత్తిక - 2,3,4, రోహిణి, మృగశిర - 1,2): మీ కోపాన్ని, చిరాకును ఎక్కువగా ప్రదర్శించడం మంచిది కాదు. కొబ్బరి, పండ్లు, చిరు వ్యాపారస్తులకు సంతృప్తి, పురోభివృద్ధి. రాజకీయాలలో వారికి గణనీయమైన పురోభివృద్ధి కానవస్తుంది. వాహనచోదకులకు ఊహించని చికాలు తలెత్తుతాయి. బ్యాంకు పనుల్లో స్వల్ప ఆటంకాలు ఎదుర్కోవలసి వస్తుంది.



**మిథునం: Gemini** (మృగశిర 3,4 పాదాలు, ఆర్ద్ర 4 పాదాలు, పునర్వసు 1,2,3 పాదాలు): కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు సంబంధించిన అధికారుల సహకారం అందుతుంది. కుటుంబీకుల మధ్య అనురాగ వాత్సల్యాలు పెంపొందుతాయి. కమ్యూనికేషన్, కంప్యూటర్, వైజ్ఞానిక రంగాలలో వారికి నూతన ఆలోచనలు స్ఫురిస్తాయి. సమయానికి మిత్రులు సహకరించక పోవడంతో అసహనికి గురవుతారు.



**కర్కాటకం: Cancer** (పునర్వసు 4వ పాదం, పుష్యమి 4 పాదాలు, ఆశ్లేష 4 పాదాలు): ఉపాధ్యాయుల తొందరపాటుతనం వల్ల సమస్యలు తలెత్తుతాయి. మీ ఆలోచనా ధృ కృథాన్ని మార్చుకోవాల్సిన సమయం. విద్యార్థినులు ప్రేమ వ్యవహారాలకు దూరంగా ఉండటం మంచిది. విలువైన వస్తువులు ఆభరణాలు కొనుగోలు చేస్తారు. నూతన వ్యాపారాలు, దీర్ఘకాలిక పెట్టుబడుల విషయంలో పునరాలోచన మంచిది.



**సింహం: Leo** (మఖ 4పాదాలు, పుబ్బ 4 పాదాలు, ఉత్తర 1 వపాదం): ప్రతిష్టలకు కొంత విఘాతం కలిగే అవగాశం ఉంది. స్త్రీలకు, నరాలు, ఎముకలు, దంతాలకు సంబంధించిన చికాకులను ఎదుర్కొంటారు. ఇతరుల కుటుంబ విషయాలలో తలదూర్చి సమస్యలు తెచ్చుకోకండి. రుణయత్నాలలో కూడా స్వల్ప మార్పులు ఉంటాయి.



**కన్య: Virgo** ( ఉత్తర - 2,3,4, హస్త, చిత్త -1,2) తలపెట్టిన పనులలో విఘ్నాలు, చీటికి మాటికి అసహనం ఎదుర్కుంటారు. గృహం ఏర్పరుచు కోవాలనే కోరిక బలపడుతుంది. మిత్రులు కూడా మీకు దూరంగా ఉండటానికి యత్నిస్తారు. ప్రైవేటు సంస్థల్లో వారికి యాజమాన్యం నుంచి ఒత్తిడి, చికాకులను ఎదుర్కొంటారు. నిరుద్యోగులకు ఇంటర్వ్యూల్లో ఏకాగ్రత అవసరం.



**తుల: Libra** (చిత్త -3,4, స్వాతి, విశాఖ -1,2,3) ఓర్పు, నేర్పుతో వ్యవహరించటం ఎంతైనా అవసరం. రుణ విముక్తులు కావటంతో మానసిక ప్రశాంతత పొందుతారు. పత్రికా రంగంలోని వారికి గుర్తింపు రాణింపు లభిస్తుంది. కోర్టు వ్యవహారాలు వాయిదా పడుట మంచిది. మీ సంతానం భవిష్యత్తు గురించి కొత్త పథకాలు వేస్తారు. పెద్దల ఆరోగ్యం నిరుత్సాహపరుస్తుంది.



**వృశ్చికం: Scorpio** (విశాఖ -4 అనూరాధ, జ్యేష్ఠ) ఇతరులపై ఆధారపడక స్వశక్తితోనే మీ పనులు పూర్తి చేసుకోవటం శ్రేయస్కరం. ఆత్మీయులతో కలిసి విహార యాత్రలలో పాల్గొంటారు. ఒక కార్యం నిమిత్తం దూరప్రయాణం చేయవలసి వస్తుంది. సన్నిహితులతో కలిసి చేపట్టిన పనులు సమీక్షిస్తారు. దూరప్రయాణాలు బ్యాంకింగ్ వ్యవహారాలలో అప్రమత్తత ఎంతో అవసరం.



**ధనుస్సు: Sagittarius** (మూల 4 పాదాలు, పూర్వాషాఢ 4 పాదాలు, ఉత్తరాషాఢ 1 వపాదం): స్థిరాస్తి క్రయ విక్రయాలు సంతృప్తికరంగా ఉంటాయి. వృత్తుల వారికి శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. స్త్రీలకు పనివారితో చికాకులు అధికమవుతాయి. అతిథి మర్యాధలు బాగుగా నిర్వహిస్తారు. కోర్టు వ్యవహారాల్లో ప్లీడర్లు, ప్లీడరు గుమస్తాలకు ఆటంకాలు తప్పవు. స్త్రీలకు టి.వి ఛానెళ్ల నుంచి ఆహ్వానం అందుతుంది.



**మకరం: Capricorn** (ఉత్తరాషాఢ -2,3,4, శ్రవణం, ధనిష్ట -1,2): ఆర్థిక వ్యవహారాల పట్ల శ్రద్ధ వహిస్తారు. ఒక్కసారి ప్రేమిస్తే ఆ ప్రేమను నిలబెట్టుకోవడానికి ఎంతైనా పోరాడతారు. మిమ్మల్ని అభిమానించే వ్యక్తుల మనస్సులను బాధపెట్టకండి. ఉద్యోగస్తులు ఒత్తిళ్ళు, ఆకర్షణలకు దూరంగా పుండటం అన్నివిధాలా క్షేమదాయకం. ఎల్.ఐ.సి, పోస్టల్ ఏజెంట్లకు ఒత్తిడి, ఆందోళన తప్పవు.



**కుంభం: Aquarius** (ధనిష్ట 3,4 పాదాలు, శతభిషం 4 పాదాలు, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు): రేపటి సమస్య గురించి అధికంగా ఆలోచిస్తారు. ముఖ్యులకు బహుమతులను అందజేస్తారు. వ్యాపారాల్లో మార్పులు, చేర్పులకు ప్రయత్నిస్తారు. ప్రేమికుల మధ్య కొత్తకొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. వాహనచోదకులకు చికాకులు ఎదురవుతాయి. ప్రతి విషయంలోనూ నిర్మొహమాటంగా మీ అభిప్రాయాలు తెలియజేయండి.



**మీనం: Pisces** (పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర 4 పాదాలు, రేవతి 4 పాదాలు): కొన్ని వ్యవహారాలు అనుకూలించినా మరికొన్ని ఆందోళన కలిగిస్తాయి. అలౌకిక విషయాల పట్ల ఆసక్తి పెరుగుతుంది. స్టేషనరీ, ప్రింటింగ్ రంగాలలో వారికి అనుకూలమైన కాలం. మిమ్మలను పొగిడేవారి పట్ల అప్రమత్తంగా మెలగండి. వృత్తి విద్యా కోర్సులలో రాణిస్తారు. ఇచ్చిపుచ్చుకునే వ్యవహారాల్లో జాగ్రత్త వహించండి.



నిద్రపోయి కలగన్నాను బ్రతుకంతా సుందరమని. మేలుకొని కనుగొన్నాను బ్రతుకు పెద్ద బాధ్యత అని. -గొథె

ఆలయం

# బ్రిటిషర్ జీర్ణోద్ధరణ చేసిన శివాలయం

బ్రిటిష్ వాళ్లు దేశాన్ని పాలించినప్పుడు మన సంపదను దోచుకున్నారు. సంపదకోసం విధ్వంసాలు సృష్టించారు. దేవాలయాలపైన దాడులు చేశారు. తిరుమల లాంటి పుణ్యక్షేత్రాల విషయంలో మాత్రం వాళ్ల ఆటలు సాగలేదు. కాని సాక్షాత్తు బ్రిటిష్ కల్నల్ మన దేశంలోని ఓ దేవాలయాన్ని జీర్ణోద్ధరణ చేసిన శివాలయం ఉంది. అది ఎక్కడుందో తెలుసా? బ్రిటిషర్ ఆ ఆలయాన్ని ఎందుకు జీర్ణోద్ధరణ కావించాడు? బ్రిటిషర్ జీర్ణోద్ధరణ చేసిన శివాలయం ఎక్కడుంది? తెలుసుకావోలానుందా ? అయితే ఈ స్టోరీ చ దవాల్సిందే..

ఆ శివాలయం మధ్యప్రదేశ్ లోని షాజాపూర్ జిల్లాలోని అగర్ మాల్వాలో ఉంది. అదే బైద్యనాథ్ మహాదేవుడి ఆలయం. ఈ ఆలయాన్నే బ్రిటిష కల్నల్ జీర్ణోద్ధరణ కావించాడు.ఒక్క మాటలో చెప్పాలంటే శిథిలమైన శివాలాయాన్ని పునర్నిమించాడు. స్వదేశం వెళ్లాక కూడా ఆ మహాదువున్ని ఇంటిలో నిలుపుకుని, జీవితాంతం సతీ సమేతంగా ఆరాధించాడు.

ఆలయ చరిత్ర..

అగర్‌మాల్వాలో కొలువైన మహాదేవుడు కోరి కొలిచేవారికి కొంగు బంగారం. తన భక్తుల పాలిటి శుభంకరుడు. బ్రిటిష్ దంపతులకు ఆయన కరుణించిన బోళాశంకరుడు. బ్రిటిష్ దంపతులు శిథిలావస్తలో ఉన్న ఆలయాన్ని పుణద్ధరించడం వెనుక కథ ఉంది. అదేమిటంటే..ఇది 1879లో జరిగిన యథార్థ సంఘటన.





కొండమీద కాషాయ కాంతి విరజివమ్మ్మతోంది..సాయంసంధ్యవేళ కొండమీద నిశ్శబ్ద వాతావరణాన్ని చీల్చుకుంటూ ..గణ గణ గణ గణ మంటూ గంటల శబ్దం చె విసోకింది. అంతే .ఆ శబ్దం వచ్చిన వైపు చూసింది ఆమె. దూరంగా ఒక శిథిల దేవాలయం కనిపించింది. అందులోనుంచి హారతి దీపాల వెలుగు కనిపిస్తోంది. ధూపాల పొగ వస్తోంది. ఘంటారావం వినిపిస్తోంది. అంతే అప్రయత్నంగానే ఆమె ఆ గుడిపైపు వెళ్లింది. గుడిముందు గుర్రం దిగి చెప్పులు విప్పి లోపలికి వెళ్లింది.

దీనికి సంబంధిచిన శిలాపలకం ఆలయంలో ఇప్పటికి మనం చూడవచ్చు. 1879లో బ్రిటిష్ సేనలకు , ఆఫ్ఘాన్ పటాలానికి మధ్య భీకరపోరు సాగుతోంది.అగర్ మాల్వా సేనలకు లెఫ్టినెంట్ కల్నల్ అయిన మార్టిన్ నాయకత్వంలో బ్రిటిష్ సేనలు యుద్ధానికి వెళ్లాయి. అయితే ప్రతిరోజు మార్టిన్ అగర్ మాల్వాలో ఉన్న తన భార్యకు తన క్షేమ సమాచారం పంపేవాడు. ఉన్నట్టుండి కల్నల్ నుంచి సమాచారం నిలిచిపోయింది.

.. ఏమయ్యాడో తెలియదు. పది రోజుల క్రింద ఉత్తరం వచ్చింది. ఆ తరువాత నుంచి ఎలాంటి సమాచారం అందలేదు. దీంతో కల్నల్ భార్య మస్సంతా ఉద్విగ్నంగా ఉంది...ఓ రోజు .సాయంత్రం....భర్త ఏమయ్యాడో తెలియని భయాందోళనతో తనకు తెలియకుండానే గుర్రం ఎక్కింది. ఎటువెళ్లాలి అనుకుందో తెలీదు. కాని తనకు తెలియకుండానే గుర్రం కొండపైకి ఎక్కుతోంది. ఆమె మనస్సంతా తన భర్త మార్టిన్ పైనే ఉంది. ఐ మిస్ యూ మార్టిన్.... ఐ మిస్ యూ సో మచ్ అని మనస్సు పరితపిస్తోంది. ఆమె .కళ్లల్లో నీళ్లు తిరిగాయి. కళ్లముందు అస్పష్టంగా కల్నల్ మార్టిన్ రూపం కదలాడుతోంది. ....సూర్యుడు పడమర ఒడిలోకి వాలి పోతున్నాడు....శివుడు కొలువై ఉన్న .

కొండమీద కాషాయ కాంతి విరజిమ్ముతోంది..సాయం సంధ్యవేళ కొండమీద నిశ్శబ్ద వాతావరణాన్ని చీల్చుకుంటూ ..గణ గణ గణ గణ మంటూ గంటల శబ్దం చె విసోకింది. అంతే .ఆ శబ్దం వచ్చిన వైపు చూసింది ఆమె. దూరంగా ఒక శిథిల దేవాలయం కనిపించింది. అందులోనుంచి హారతి దీపాల వెలుగు కనిపిస్తోంది. ధూపాల పొగ వస్తోంది. ఘంటారావం వినిపిస్తోంది. అంతే అప్రయత్నంగానే ఆమె ఆ గుడిపైపు వెళ్లింది. గుడిముందు గుర్రం దిగి చెప్పులు విప్పి లోపలికి వెళ్లింది....లోపల వైద్యనాథ మహాదేవునిగా పూజలు ందుకుంటున్న శివలింగం దర్శనం ఇచ్చిఇంది. పూజారి పూజారి శివార్చన చేస్తున్నాడు...... అంతా శివేచ్ఛ. అది చూస్తూ ఆమె అక్కడే నిలబడిపోయింది. కాని ఆమె మనస్సంతా భర్త మార్టిన్ నిండి ఉన్నాడు. .కళ్లనుండి ధారగా నీరు కారుతూనే ఉంది....అర్చన పూర్తి కాగానే పూజారి ఆమె వైపు చూసాడు. ఓ బ్రిటిష్ మహిళ ఆలయంలోకి రావడం ఆశ్చర్యం వేసింది. ఆమె కళ్లు చూస్తే భయంకరమైన బాధ అనుభవిస్తున్నాయి. ఆమెదగ్గరకు వచ్చి తీసుకొండి అంటూ చెప్పాడు.తీర్తప్రసాదాలు ఇచ్చిన తర్వాత ....దుఃఖిస్తున్నారు ఏమైందమ్మా అని ప్రశ్నించాడు. అన్యాపదేశంగానే తీర్థప్రసాదాలు స్వీకరించిన కల్నల్ భార్య, తన భర్త కల్నల్ మార్టిన్ అఫ్గన్ యుద్ధానికి వెళ్లిన సంగతి, ఆయన క్షేమ సమాచారం లేని విషయమూ చెప్పింది. చెప్పిందన్న మాటే కానీ కన్నీళ్ల వర్షం కురుస్తూనే ఉంది. అది విన్న పూజారి .. అమ్మా ... కంగారు పడకండి... బైద్యనాథ్ మహాదేవుడు అందరినీ కాపాడతాడు... ఆయన దయ ఉంటే మృత్యువు ఏమీ చేయదు. అంతఃకరణశుద్ధిగా బైద్యనాథుడిని అర్చించండి. ఓం నమశ్శివాయ అన్న మంత్రాన్ని పదకొండు రోజుల పాటు

అగర్‌మాల్వాలో కొలువైన మహాదేవుడు కోరి కొలిచేవారికి కొంగు బంగారం. తన భక్తుల పాలిటి శుభంకరుడు. బ్రిటిష్ దంపతులకు ఆయన కరుణించిన బోళాశంకరుడు. బ్రిటిష్ దంపతులు శిథిలావస్తలో ఉన్న ఆలయాన్ని పుణద్ధరించడం వెనుక కథ ఉంది. అదేమిటంటే..ఇది 1879లో జరిగిన యథార్థ సంఘటన. దీనికి సంబంధిచిన శిలాపలకం ఆలయంలో ఇప్పటికి మనం చూడవచ్చు. 1879లో బ్రిటిష్ సేనలకు , ఆఫ్ఘాన్ పటాలానికి మధ్య భీకరపోరు సాగుతోంది.అగర్ మాల్వా సేనలకు లెఫ్టినెంట్ కల్నల్ అయిన మార్టిన్ నాయకత్వంలో బ్రిటిష్ సేనలు యుద్దానికి వెళ్లాయి. అయితే ప్రతిరోజు మార్టిన్ అగర్ మాల్వాలో ఉన్న తన భార్యకు తన క్షేమ సమాచారం పంపేవాడు.

జపించండి. అంతా మంచే జరుగుతుంది అని చెప్పాడు. ఆమెకి ఏమనిపించిందో తెలియదు కానీ ఆ మరుసటి రోజు నుంచే అన్నపానాలు మానేసింది. అన్ని పనులూ మానేసింది. తన గదిలోనే కూచుంది....;ఓం నమశ్శివాయ.... ఓం నమశ్శివాయ...; మంత్రం జపించసాగింది. మరొక ధ్యాస లేదు... ఇంకో ధ్యానం లేదు.... ఓం నమశ్శివాయ...మంత్ర పఠనం తప్ప. .ఒకటి ... రెండు .... మూడు ..... నాలుగు .... అయిదు ..... పది రోజులు గడిచిపోయాయి. పదకొండో రోజు.... ఆమె అదే నిష్ఠతో పంచాక్షరిని జపిస్తోంది. ఆరోజు సాయంకాలం . సేవకుడొకడు ....;మేమ్ సాబ్ ... మేమ్ సాబ్... సాహిబ్ దగ్గర నుంచి లెటర్ వచ్చిందంటూ పరిగెత్తుకుంటూ వచ్చాడు...మనస్సులో అలజడిని కంట్రోల్ చేసుకుంటూ ఆమె ఆ లేఖను తెరిచి చూసింది...అందులో ఇలా రాసి ఉంది. . గతంలో నీకు లేఖ వ్రాసిన మరుసటి రోజు నుంచే అఫ్గన్లు మా పటాలాన్ని చుట్టుముట్టారు. నలు వైపుల నుంచి భీకరమైన దాడి చేశారు. మేమెవరమూ బతికిబట్టకట్టి బయటపడే పరిస్థితి లేదు. మా దగ్గర ఆయుధాలూ తక్కువే... ఆహారమూ తక్కువే.... వాళ్లు వందల సంఖ్యలో ఉన్నారు.... ఇక మా పని అయిపోయిందనుకున్నాను.... ఒక అఫ్గన్ పొడవాటి ఖడ్గంతో నాపై దూకాడు... నేను భయంతో కళ్లు మూసుకున్నాను... ఆ క్షణంలో నువ్వు తప్ప నాకింకెవరూ గుర్తుకురాలేదు... అంతలో అద్భుతం జరిగిపోయింది.... ఎవరో ఒక మనిషి అఫ్గన్లపైకి దూకాడు... ఆయన్ని నేను అంతకుముందు ఎప్పుడూ చూడలేదు....ఒళ్లంతా తెల్లగా ఏదో రాసుకున్నాడు. పులి చర్మం మొలకి కట్టుకున్నాడు... చేతుల్లో పొడవాటి ఆయుధం ఉంది.. దాని కొన మూడుగా చీలి ఉంది.... ఆయన ధాటికి అఫ్గన్లు కకావికలమైపోయారు. కాలికి బుద్ధిచెప్పి పారిపోయారు....వాళ్లు పారిపోగానే ఆయన కూడా ఏమైపోయాడో తెలియదు.... ఎక్కడికి వెళ్లిపోయాడో తెలియదు... ఆయన ఆ క్షణాన వచ్చి ఉండకపోతే నేను నీకు దక్కేవాడికి కాదు డియర్.. అది చదివిన తర్వాత ఆమెకు త భ ర్తను కాపాడింది సాక్షాత్తు ఆ మహాదేవుడే అని అర్థమైంది. నాటి నుంచి ఆమె పరమ శివభక్తురాలుగా మారింది. 1880లో అఫ్గన్ యుద్ధం నుంచి తిరిగి వచ్చాక కల్నల్ మార్టిన్ విషయం చెప్పింది. భర్త మార్టిన్ తో కలిసి కొండమీద కొలువున్న బైద్యనాథ్ మహాదేవుడిని దర్శించేసుకుంది. ప్రస్తుతం తాము క్షేమంగా ఉండడానికి కారణం ఆ శివయ్యే అని మార్టిన్ దంపతులు నమ్మారు. అందుకే శిథిలావస్థలో ఉన్న ఆ దేవాలయం జీర్ణోద్ధరణకు పదిహేనువేల రూపాయలు వెచ్చించారు.మహాదేవ్ మందిరానికి కొత్త శోభ వచ్చింది. మందిరం ముందు ఉన్న శిలాఫలకంపై తమ కథను కల్నల్ మార్టిన్, ఆయన భార్య వ్రాయించారు. కొన్నాళ్లకి కల్నల్ మార్టిన్ సతీ సమేతంగా ఇంగ్లండుకు తిరిగి వెళ్లిపోయారు. అక్కడ కూడా వారి ఇంట్లో శివుడి విగ్రహం పెట్టుకున్నారు. కడవరకూ ఆయన్నే అర్చించారు. మొత్తానికి దేశంలో బ్రిటిషర్ జీర్ణోద్ధర కావించి ఏకైక దేవాలయంగా బైద్యనాథ్ మహాదేవుడి ఆలయం చరిత్రలో మిగిలి పోయింది.



## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | వెల రూ. |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

